# సరల-వాక్య-రామాయణమ్

(సులువు నుడువుల రామకథ)

సంస్కృతమూలం- (బహుశ) సుబోధసంస్కృతమ్

తెలుగు అనువాదం- శ్రీ శ్రీనివాస్ ఉరుపుటూరి

# తొలిపలుకు

రామాయణం మహత్యం గురించి భారతీయులకు సంస్కృతజ్ఞులకు సంస్కృతార్థులకు కానీ విశేషంగా వివరించి చెప్పవలసిన అవసరమే లేదు. సంస్కృతం నేర్చుకోవాలి అనుకునేవారికోసం సంస్కృత వాఙ్మయంలోని విషయాన్ని సరలభాషలో అందించగలగటం ఒక అపురూపమైన సమన్వయం. సంస్కృతం సులువుగా నేర్పించే ప్రయత్నంలో చాలాకాలంగా మంచి మంచి కృతులు బయటికి వచ్చాయి. ఎందరో లేఖకులు తమకు తోచిన విధంగా ఎంతో సామాగ్రిని సరళమైన భాషలో కూర్చి అందించారు. సర్వయోజని (ఇంటర్నెట్) పుణ్యమా అని ఆ సామగ్రి మనకు అందరికి అందుబాటులోకి వచ్చింది. అటువంటి ప్రయత్నాలలోనుండి ఒకటి — ఈ సరళ వాక్య రామాయణం.

ఒక సంస్కృత పాఠ్యపుస్తకంలో అనుబంధంగా ఈ వాక్యాలలో రామాయణ కథను అందించే ప్రయత్నం చేశాడు రచయిత. దురదృష్టవశాత్తు ఆ పుస్తకం తాలూకు ఫైల్ నాకు మళ్ళీ కనిపించలేదు. అందులో నుంచి ఇంత భాగం మటుకు పక్కకు తీసి పెట్టింది ఉన్నది. అందువల్ల మూలపుస్తకం గురించి కానీ, రచయిత గురించి కానీ ఎటువంటి వివరం అందించలేకపోతున్నాను. అందుకు చింతిస్తున్నాను. హిందీలో ఒక సామెత ఉన్నది– 'మామిడి పండ్లు తిను, టెంకలు లెక్క పెట్టకు' అని. కనుక మనకు కావాల్సింది సంస్కృతం నేర్చుకునే సామాగ్రి. అది మన చేతిలో ఉన్నది. ఇక మిగతా విషయాల గురించిన చింత అనవసరము. (పుస్తకం లభ్యమయ్యేదాకా.)

సరలంగా వ్రాయటానికే ఎక్కువ ప్రయత్నం కావాలి. సరలీకరించటానికే సమయం పడుతుంది. అది కూడా విద్వత్తుకు నికషోపలం. ఆ పనిలో ఈ రచయిత ఎంత విజయవంతం అయ్యారో మొదటి వాక్యం చదివితే తెలుస్తుంది. అందుకు ఆ అజ్ఞాత రచయితకు అనేకకోటి ధన్యవాదాలు.

మొత్తానికి ఈ కార్యక్రమాన్ని చేపట్టి దీనికి హిందీ, ఆంగ్లము, తెలుగులలో అనువాదంతో కలిపి జనాలకు అందించాలి అనే ఒక సంకల్పం భగవత్ ప్రేరణతో కలిగింది. సంకల్పం కలిగినదే తడవుగా ఈ

సత్కార్యాన్ని సేవగా భావించి చేసేవాళ్లు కూడా వెనువెంటనే ముందుకు వచ్చారు. తెలుగు అనువాదాన్ని ప్రారంభ వాక్యం నుండి చివరి వాక్యం దాక ఎంతో ఉత్సాహంతో ఒకే రకమైన పద్ధతిని అవలంబిస్తూ పూర్తి చేసి అందించినవారు శ్రీనివాస్ ఉరుపుటూరి గారు. వారికి శతకోటి ధన్యవాదాలు. తెలుగు వారి కోసం భాష నేర్చుకునే దృష్టితో ఎంతో వైనంగా, జాగ్రత్తగా తన అనువాదాన్ని కూర్చి మనకు అందించినందుకు వారికి మనం ఋణపడి ఉంటాము.

ఇది చాలా చిన్న పనిగా మొదలైంది. తడవకు ఒక పాఠము తీసుకుని, దాన్ని ఒక పోస్టు లాగా వేయటం అలవాటు అయింది. ఆ విధంగా సుమారు 30 పాఠాలు తెలుగు పాఠకుల కోసం అందించాము. కేవలం వాట్సాప్ లేఖల వరకు వ్రాసి వదిలేయకుండా ఆ సామాగ్రినంతటినీ ఒక చోట పెట్టి పైన సంస్కృత వాక్యము కింద తెలుగు అనువాదంతో పుస్తకంగా మలచి వారే అందించారు. మంచి ఫాంట్ వాడి, ఆకర్షణీయంగా తయారు చేసి అందించినందుకు వారికి మరిన్ని ధన్యవాదాలు.

దశరథుని కుమారుడు రాముడు అంటూ ప్రారంభమై, శ్రీరాముని కల్యాణము వరకు సాగిన ఈ లఘుపాఠాలు భాషాజ్ఞానార్థులైన మీకు వీలైనంత ఉపకారం చేయాలిగాక. సంస్కృతభాషాభివృద్ధిరస్తు. శ్రీరామానుగ్రహప్రాప్తిరస్తు. సమస్తసన్మంగళాని భవంతు.

--*--

# (౧) ప్రథమః పాఠః — మొదటి పాఠము

౧. బాలకః గణేశం నమతి ।

1. బాలకుడు గణేశుడికి నమస్కరిస్తున్నాడు.

౨. బాలకస్య నామ అశోకః ।

2. బాలకుడి పేరు అశోకుడు.

౩. తస్య హస్తే పుస్తకమ్ అస్తి ।

3. అతడి చేతిలో పుస్తకము ఉన్నది.

౪. పుస్తకస్య నామ సుబోధసంస్కృతమ్ ।

4. పుస్తకము యొక్క పేరు 'సుబోధసంస్కృతమ్'.[1]

౫. అశోకః పాఠశాలాం గచ్ఛతి, గురుం నమతి, పుస్తకం పఠతి చ ।

5. అశోకుడు పాఠశాలకు వెళ్ళుతాడు. గురువుకు నమస్కరిస్తాడు, పుస్తకము చదువుతాడు కూడా.

౬. తేన గురుః సన్తుష్టః భవతి ।

6. అతడితో/అతడి కారణంగా గురువు సంతోషిస్తాడు.

౭. గురవే నమః ॥

7. గురువుకు నమస్కారము.

--*--

[1] సులువుగా సంస్కృతం, సులువైన సంస్కృతం లేదా సులువుగా అర్థమయ్యే సంస్కృతం లేదా సంస్కృతం మేడ్ ఈజీ).

## (౨) ద్వితీయః పాఠః –రెండవ పాఠము

౧. శ్రీరామాయ నమః ।

1. శ్రీరాముడికి నమస్కారము.

౨. క ఏషః బాలకః?

2. ఎవరీ బాలుడు?

౩. ఏష బాలకః రామః ।

3. ఈ బాలుడు రాముడు.

౪. రామః కస్య పుత్ర అస్తి?

4. రాముడు ఎవరి కొడుకు?

౫. రామః దశరథస్య పుత్రః ।

5. రాముడు దశరథుడి కొడుకు.

౬. క ఏష దశరథః?

6. ఎవరు ఈ దశరథుడు?

౭. దశరథ అయోధ్యాయాః రాజా అస్తి ।

7. దశరథుడు అయోధ్యకు రాజు.

౮. దశరథః రామస్య పితా ।

8. దశరథుడు రాముడి యొక్క తండ్రి.

౯. రామో దశరథం నమతి ।

9. రాముడు దశరథుడికి నమస్కరిస్తున్నాడు.

౧౦. రామస్య మాతా కా?

10. రాముడి తల్లి ఎవరు?

౧౧. రామస్య మాతా కౌసల్యా ।

11. రాముడి తల్లి కౌసల్య.

౧౨. తస్మాత్ కౌసల్యా దశరథస్య భార్యా ।

12. అందువలన కౌసల్య దశరథుడి భార్య.

౧౩. రామః కౌసల్యాం నమతి ।

13. రాముడు కౌసల్యకు నమస్కరిస్తున్నాడు.

౧౪. రామో మాతరం నమతి ।

౧౪. రాముడు తల్లికి నమస్కరిస్తున్నాడు.

౧౫. రామః పితరం నమతి ।

15. రాముడు తండ్రికి నమస్కరిస్తున్నాడు.

౧౬. స మాతాపితరౌ నమతి ।

16. అతడు తల్లిదండ్రులిరువురికి నమస్కరిస్తున్నాడు.

౧౭. మాతాపితృభ్యాం నమః ॥

17. తల్లిదండ్రులకిరువురికి నమస్కారము.

--*--

# (౩) తృతీయః పాఠః – మూడవ పాఠము

౧. శ్రీలక్ష్మణాయ నమః ।

1. శ్రీ లక్ష్మణుడికి నమస్కారము.

౨. లక్ష్మణః దశరథస్య అపరః పుత్ర అస్తి ।

2. లక్ష్మణుడు దశరథుడి యొక్క మరొక కుమారుడు.

౩. లక్ష్మణస్య మాతా సుమిత్రా ।

3. లక్ష్మణుడి తల్లి సుమిత్ర.

౪. సుమిత్రా చ దశరథస్య అపరా భార్యా ।

4. సుమిత్ర దశరరథుడికి మరొక భార్య కూడా.

౫. రామః దశరథస్య పుత్రః ।

5. రాముడు దశరథుడి పుత్రుడు.

౬. లక్ష్మణః అపి దశరథస్య పుత్రః ।

6. లక్ష్మణుడు కూడా దశరథుడి పుత్రుడు.

౭. తస్మాత్ రామః లక్ష్మణస్య భ్రాతా ।

7. అందువలన రాముడు లక్ష్మణుడి యొక్క అన్న.

౮. రామః లక్ష్మణస్య ప్రియః ।

8. రాముడు లక్షణుడికి ప్రియమైనవాడు.

౯. లక్ష్మణః అపి రామస్య ప్రియః।

9. లక్ష్మణుడు కూడా రాముడికి ప్రియమైనవాడు.

౧౦. రామలక్ష్మణాభ్యాం నమః ॥

10. రామలక్ష్మణులకిరువురికీ నమస్కారము.

--*--

## (౪) చతుర్థః పాఠః – నాలుగవ పాఠము

౧. పిత్రే నమః ।

1. తండ్రికి నమస్కారము.

౨. రామః లక్ష్మణస్య భ్రాతా అస్తి ।

2. రాముడు లక్ష్మణుడికి అన్న అవుతాడు.

౩. రామః లక్ష్మణస్య కీదృశః భ్రాతా అస్తి?

3. రాముడు లక్ష్మణుడికి ఎలాగ అన్న అవుతాడు?

౪. న సః లక్ష్మణస్య సహోదరః భ్రాతా ।

4. అతడు లక్ష్మణుడి తోడబుట్టిన అన్న కాదు.

౫. కథమ్ ఏతత్?

5. ఇది ఎట్లా?

౬. రామస్య మాతా కౌసల్యా ।

6. రాముడి తల్లి కౌసల్య.

౭. పరన్తు లక్ష్మణస్య మాతా సుమిత్రా ।

7. కానీ లక్ష్మణుడి తల్లి సుమిత్ర.

౮. తస్మాత్ రామః లక్ష్మణస్య సాపత్న్యః భ్రాతా అస్తి, న తు సహోదరః ।

8. అందువలన రాముడు లక్ష్మణుడికి సవతి అన్న అవుతాడు, తోడబుట్టినవాడు మాత్రము కాదు.

౯. తథాపి రామః లక్ష్మణస్య ప్రియః ।

9. అయినా రాముడు లక్ష్మణుడికి ప్రియమైనవాడు.

౧౦. లక్ష్మణః చ రామస్య ప్రియః ।

10. లక్ష్మణుడు రాముడికి ప్రియమైనవాడు.

౧౧. రామలక్ష్మణౌ ద్వౌ అపి నృపస్య దశరథస్య ప్రియౌ, అతీవ ప్రియౌ ।

11. రామలక్ష్మణులు ఇద్దరూ రాజు దశరథుడికి ప్రియమైన వారు. చాలా ప్రియమైనవారు.

౧౨. నృపాయ దశరథాయ నమః ॥

12. దశరథ (మహా)రాజుకు నమస్కారము.

--*--

# (౫) పఞ్చమః పాఠః — ఐదవ పాఠము

౧. నృపాయ నమః ।

1. రాజుకు నమస్కారము.

౨. రాజా దశరథః అయోధ్యాయాం రాజ్యం కరోతి, ప్రజాః రక్షతి చ ।

2. దశరథమహారాజు అయోధ్యలో రాజ్యం చేస్తూ ఉండేవాడు, ప్రజలను రక్షించేవాడు, కూడా.

౩. తస్య ఏకా భార్యా కౌసల్యా, అపరా చ సుమిత్రా నామ ।

3. అతనికి ఒక భార్య కౌసల్య, మరొకర్తె పేరు సుమిత్ర.

౪. దశరథస్య తృతీయా అపి భార్యా అస్తి ।

4. దశరథుడికి మూడవ భార్య కూడా ఉన్నది.

౫. తస్యాః నామ కైకేయీ ।

5. ఆమె యొక్క పేరు కైకేయి.

౬. తస్యా అపి పుత్రః అస్తి, భరతః నామ ।

6. ఆమెకు కూడా కొడుకు ఉన్నాడు, పేరు భరతుడు.

౭. సుమిత్రాయాః ద్వితీయః అపి పుత్రః అస్తి, శత్రుఘ్నః నామ ।

7. సుమిత్రకు రెండవ కొడుకు కూడా ఉన్నాడు, పేరు శత్రుఘ్నుడు.

౮. భరతః రామస్య సాపత్నః భ్రాతా । తథా చ శత్రుఘ్న అపి ।

8. భరతుడు రాముడికి సవతి తమ్ముడు. అలాగే శత్రుఘ్నుడు కూడా.

౯. కిన్తు శత్రుఘ్నః లక్ష్మణస్య సహోదరః ।

9. అయితే, శత్రుఘ్నుడు లక్ష్మణుడి సోదరుడు[2].

౧౦. భ్రాతృభ్యః నమః ॥

10. అన్నదమ్ములకు నమస్కారము.

--*--

[2] ఒకే కడుపున పుట్టినవాడు.

# (౬) షష్ఠః పాఠః – ఆరవ పాఠము

౧. రామః లక్ష్మణః భరతః శత్రుఘ్నః చ చత్వారః భ్రాతరః సన్తి ।

1. రాముడు, లక్ష్మణుడు, భరతుడు, మరియు శత్రుఘ్నుడు నలుగురు అన్నదమ్ములు.

౨. సర్వే అపి శూరాః గుణవన్తః చ భవన్తి ।

2. అందరూ శూరులు, గుణవంతులు కూడా.

౩. తేషాం రామః సర్వస్య ప్రియః ।

3. వారికి అందరికీ రాముడు ఇష్టమైనవాడు.

౪. విశేషతః తు రామః లక్ష్మణస్య ప్రియః ।

4. ముఖ్యంగా, రాముడు లక్ష్మణుడికి ఇష్టమైనవాడు.

౫. బాల్యాత్ ప్రభృతి అతీవ ప్రియః ।

5. చిన్నప్పటినుంచీ చాలా ఇష్టమైనవాడు.

౬. స అపి లక్ష్మణేన వినా అన్నం న భక్షయతి, నిద్రామ్ అపి న లభతే ।

6. అతడు కూడా లక్ష్మణుడు లేకుండా అన్నము కూడా తినేవాడు కాదు, నిద్ర కూడా పోయేవాడు కాదు.

౭. యదా రామః అశ్వమ్ ఆరోహతి, మృగయాయై చ గచ్ఛతి, తదా లక్ష్మణః అపి చాపం గృహీత్వా తమ్ అనుగచ్ఛతి ।

7. ఎప్పుడైతే రాముడు గుఱ్ఱమును ఎక్కుతాడో[3], వేటకు వెళ్తాడో, అప్పుడు లక్ష్మణుడు కూడా విల్లునందుకొని అతడి వెంట వెళ్ళేవాడు.

౮. భరతః శత్రుఘ్నస్య ప్రియః ।

8. భరతుడు శత్రుఘ్నుడికి ఇష్టమైనవాడు.

౯. శత్రుఘ్నః అపి భరతస్య బాల్యాత్ ప్రభృతి అతీవ ప్రియః అస్తి ।

9. శత్రుఘ్నుడు కూడా భరతుడికి చిన్నప్పటినుంచీ చాలా ఇష్టమైనవాడు.

౧౦. తైః చతుర్భిః పుత్రైః రాజా దశరథః ప్రసన్నః అస్తి ॥

10. ఆ నలుగురు కొడుకుల కారణంగా దశరథ మహారాజు సంతోషంగా ఉండేవాడు.

--*--

[3] గుఱ్ఱపు సవారీ చేస్తున్నప్పుడు

# (౭) సప్తమః పాఠః – ఏడవ పాఠము

౧. ఏకదా విశ్వామిత్రః అయోధ్యామ్ అగచ్ఛత్ ।

1. ఒకరోజు విశ్వామిత్రుడు అయోధ్యకు వచ్చాడు.

౨. రాజభవనం చ గత్వా దశరథస్య కిఙ్కరమ్ అవదత్– "అహమ్ అస్మి మునిః విశ్వామిత్రః నామ ।

2. రాజభవనానికి వెళ్ళి దశరథుడి సేవకుడితో చెప్పాడు–"నేను విశ్వామిత్రుడనే పేరుగల మునిని.

౩. వనే వసామి । అద్య వనాత్ ఆగతః అస్మి ।

3. అడవిలో నివసిస్తాను. నేడు అడవి నుండి వచ్చాను.

౪. రాజానం దశరథం చ ద్రష్టుమ్ ఇచ్ఛామి।" ఇతి ।

4. దశరథమహారాజును చూడాలని కోరుకుంటున్నాను." అని.

౫. కిఙ్కరః రాజానమ్ అగచ్ఛత్, అవదత్ చ– "దేవ, విశ్వామిత్రః నామ కశ్చిత్ వనాత్ ఆగతః మునిః ద్వారే తిష్ఠతి,

5. సేవకుడు రాజు వద్దకు వెళ్ళాడు, చెప్పాడు కూడా– "ప్రభూ, విశ్వామిత్రుడనే ముని ఎవరో అడవినుంచి వచ్చాడు, వాకిట నిలిచి ఉన్నాడు.

౬. దేవం చ ద్రష్టుమ్ ఇచ్ఛతి ।

6. ప్రభువును చూడగోరుతున్నాడు.

౭. శ్రుత్వా దేవః ప్రమాణమ్ ।" ఇతి ।

7. ఆ పైన ప్రభువుల ఆనతి." అని విన్నవించాడు.

౮. కిఙ్కరస్య వచనేన నృపః సన్తుష్టః అభవత్ ।

8. సేవకుడి మాటలను విని దశరథుడు సంతోషించాడు.

౯. సింహాసనాత్ చ ఉత్థాయ బహిః ఆగచ్ఛత్।

9. సింహాసనము నుంచి లేచి బయటకు వచ్చాడు.

౧౦. విశ్వామిత్రం చ అర్ఘ్యేణ అపూజయత్ ।

10. విశ్వామిత్రుడిని అర్ఘ్యముతో పూజించాడు.

౧౧. తేన విశ్వామిత్రః ప్రసన్నః అభవత్, రాజభవనం చ అవిశత్ ॥

11. విశ్వామిత్రుడు అతడి యెడల ప్రసన్నుడయ్యాడు, రాజభవనములోనికి ప్రవేశించాడు.

--*--

# (౮) అష్టమః పాఠః – ఎనిమిదవ పాఠము

౧. నృపస్య ఆదరేణ విశ్వామిత్రః ప్రసన్నః అభవత్ ।

1. రాజు యొక్క ఆదరముతో విశ్వామిత్రుడు ప్రసన్నుడయ్యాడు.

౨. తం చ కుశలమ్ అపృచ్ఛత్ ।

2. అతడిని క్షేమం అడిగాడు.

౩. నృపః అవదత్– "మహామునే, ఆగమనస్య కిం కారణమ్? తవ కామం కర్తుమ్ ఇచ్ఛామి ।" ఇతి ।

3. రాజు అన్నాడు– "మహామునీ, రాకకు ఏమి కారణము? మీ కోరికను నెరవేర్చాలని కోరుకుంటున్నాను." అని.

౪. మునిః అన్నాడు– "భోః రాజన్, తవ వచనేన ప్రసన్నః అస్మి ।

4. ముని చెప్పాడు– "ఓ రాజా, నీ మాటలతో ప్రీతి చెందాను.

౫. అయం మమ కామః ।

5. ఇది నా కోరిక.

౬. యత్ర అహం వనే వసామి, తత్ర ద్వౌ రాక్షసౌ అపి వసతః ।

6. ఏ అడవిలో అయితే నేను నివసిస్తున్నానో, అక్కడ ఇద్దరు రాక్షసులు కూడా నివసిస్తున్నారు.

౭. ఏకః మారీచః నామ, అన్యః చ సుబాహుః ।

7. ఒకడు మారీచుడు. మరొకడు సుబాహుడు.

౮. ద్వౌ అపి మమ యజ్ఞస్య విఘ్నకరౌ భవతః ।

8. ఇద్దరు కూడా నా యజ్ఞమునకు విఘ్నమును కలిగిస్తూ ఉన్నారు.

౯. తౌ రుధిరేణ మమ వేదీం సిఞ్చతః ।

9. వారిద్దరు రక్తముతో నా యజ్ఞవేదికను తడుపుతున్నారు.

౧౦. తేన మమ వ్రతభఙ్గః భవతి ।" ఇతి ।

10. దానితో నా వ్రతము భంగమవుతున్నది." అని.

౧౧. రాజా అపృచ్ఛత్ – "యది ఏవం, భవాన్ తౌ కిం న దణ్డయతి?" ఇతి ॥

11. రాజు అడిగాడు – "అలా అయితే, తమరు వారిని ఎందుకు దండించడం లేదు?" అని.

--*--

## (౯) నవమః పాఠః – తొమ్మిదవ పాఠము

౧. మునిః ప్రత్యభాషత– "అహం తౌ స్వయం న దణ్డయామి యతః మమ వ్రతం క్రోధేన నశ్యతి ।

1. ముని బదులు చెప్పాడు– "నేను వారిద్దరిని స్వయంగా దండించను ఎందుకంటే, కోపం కారణంగా నా వ్రతము నశిస్తుంది.

౨. తస్మాత్ రామం మే ప్రయచ్ఛ ।

2. అందువలన రాముడిని నాకు ఇవ్వు.

౩. సః విఘ్నకరాన్ రాక్షసాన్ దణ్డయిష్యతి ।

3. అతడు విఘ్నములను కలిగించే రాక్షసులను దండిస్తాడు.

౪. తేన ఖ్యాతః భవిష్యతి చ ।

4. దానితో కీర్తిమంతుడు అవుతాడు కూడా.

౫. అద్య ఏవ రామేణ సహ వనం గమిష్యామి ।" ఇతి ।

5. ఇవాళనే రాముడితో కలిసి అడవికి వెళతాను." అని.

౬. రామః దశరథస్య జ్యేష్ఠః పుత్రః ।

6. రాముడు దశరథుడి పెద్దకొడుకు.

౭. తస్మాత్ విశ్వామిత్రస్య తద్వచనం శ్రుత్వా దశరథః దుఃఖితః అభవత్ ।

7. అందువలన విశ్వామిత్రుడి ఆ మాట(ల)ను విని దశరథుడు దుఃఖితుడయ్యాడు.

౮. ఋషిమ్ అవదత్ చ– "రామః అద్యాపి బాలకః ఏవ ।

8. ఇంకా, ఋషితో అన్నాడు – "రాముడు నేటికీ బాలుడే.

౯. ఏకాకీ రాక్షసైః సహ యుద్ధం కర్తుం న శక్తః ।

9. ఒక్కడే రాక్షసులతో యుద్ధము చేయజాలడు.

౧౦. సైన్యం గృహీత్వా అహమ్ అపి రామేణ సహ వనం గమిష్యామి ।

10. సైన్యాన్ని తీసుకొని నేను కూడా రాముడితో కలిసి అడవికి వెళతాను.

౧౧. రాక్షసైః సహ యుద్ధం చ కరిష్యామి ।

11. రాక్షసులతో యుద్ధం చేస్తాను కూడా.

౧౨. తస్మాత్ సర్వం మే కథయ– కే తే రాక్షసాః?

12. అందువలన, అంతా నాకు చెప్పండి– ఎవరా రాక్షసులు?

౧౩. కీదృశం తేషాం బలమ్? కే తాన్ రక్షన్తి?" ఇతి ॥

13. ఎటువంటిది వారి బలము? ఎవరు వారిని రక్షిస్తున్నారు?" అని.

--*--

# (౧౦) దశమః పాఠః – పదవ పాఠము

౧. దశరథస్య తత్ వచనం శ్రుత్వా విశ్వామిత్రః అభాషత–“ఆస్తి దక్షిణస్యాం దిశాయాం లఙ్కా నామ నగరీ ।

1. దశరథుడి ఆ మాటను విన్నాక, విశ్వామిత్రుడు అన్నాడు– “దక్షిణదిక్కునందు లంక అనే పేరు గల నగరము ఉన్నది.

౨. తత్ర రావణః నామ రాక్షసః వసతి ।

2. అక్కడ రావణుడనే రాక్షసుడు ఉన్నాడు.

౩. అన్యే రాక్షసాః రావణస్య సహాయాః ।

3. ఇతరరాక్షసులు రావణుడి అనుచరులు.

౪. రావణాయ విధినా వరః దత్తః ।

4. రావణుడికి విధి[4]చేత వరము ఈయబడినది.

౫. తేన మత్తః సః సజ్జనాన్ పీడయతి ।

5. దానితో మదించిన అతడు (రావణుడు) సజ్జనులను పీడిస్తున్నాడు.

౬. యజ్ఞస్య విఘ్నకరః భవతి చ ।

6. యజ్ఞములకు విఘ్నములు కలిగించేవాడు అవుతున్నాడు కూడా ।

[4] బ్రహ్మ

౭. యదా రావణః స్వయం యజ్ఞస్య విఘ్నకరః న భవతి, తదా సః మారీచం సుబాహుం చ ప్రవర్తయతి ।

7. ఒకవేళ యజ్ఞములకు స్వయముగా విఘ్నములను కల్పించలేకపోతే అతడు మారీచుడిని, మరియు సుబాహుడిని పురమాయిస్తాడు.

౮. తస్మాత్ తౌ మమ యజ్ఞస్య విఘ్నకరౌ భవతః ।

8. అందువలన వారిద్దరు నా యజ్ఞమును ఆటంకపరుస్తున్నారు.

౯. అన్యే అపి రాక్షసాః మమ యజ్ఞస్య విఘ్నకరాః భవన్తి ।" ఇతి ॥

9. ఇతరరాక్షసులు కూడా నా యజ్ఞమునకు విఘ్నకారకులు అవుతున్నారు." అని.

--*--

# (౧౧) ఏకాదశః పాఠః – పదకొండవ పాఠము

౧. రాజా వదతి– "మహర్షే, మమ చత్వారః పుత్రాః – రామలక్ష్మణభరతశత్రుఘ్నాః ।

1. రాజు అన్నాడు– "మహర్షీ, నాకు నలుగురు కొడుకులు – రామలక్ష్మణభరతశత్రుఘ్నులు.

౨. చతుర్ణాం పుత్రాణాం రామః జ్యేష్ఠః । సర్వేషాం రామః మమ అతీవ ప్రియః ।

2. నలుగురు కొడుకులలో రాముడు పెద్దవాడు. అందరిలోనూ రాముడు నాకు చాలా ప్రియమైనవాడు.

౩. రామః అద్యాపి బాలకః ఏవ। కథం సః ఏకాకీ రాక్షసైః సహ యుద్ధం కరిష్యతి? బాలం రామం తే న దాస్యామి ।" ఇతి ।

3. రాముడు ఇప్పటికీ పిల్లవాడే. ఎల్లాగా అతడు ఒక్కడే రాక్షసులతో యుద్ధము చేయగలడు? బాలుడైన రాముడిని మీకు ఇవ్వను." అని.

౪. శీఘ్ర–కోపః విశ్వామిత్రః దశరథాయ క్రుధ్యతి ।

4. ముక్కోపి అయిన విశ్వామిత్రుడు దశరథుడిపై కోపం తెచ్చుకున్నాడు.

౫. తస్య నేత్రే ఆరక్తే భవతః ।

5. అతడి కన్నులు ఎఱ్ఱబడతాయి.

౬. సః రాజానం వదతి– "రాజన్ దశరథ, పూర్వం త్వమ్ అవదః– 'తవ కామం కర్తుమ్ ఇచ్ఛామి ।' ఇతి । ఇదానీం చ వదసి– 'న తవ కామం కరిష్యామి ।' ఇతి ।

6. అతడు రాజుతో అన్నాడు – "రాజా దశరథా, ఇంతకు మునుపు నీవన్నావు– 'నీ కోరికను నెరవేర్చాలని ఉన్నది.' అని. ఇప్పుడేమో అంటున్నావు– 'నీ కోరికను తీర్చను.' అని.

౭. ఏతత్ తవ న ఉచితమ్ ।

7. ఇది నీకు తగదు.

౮. అహం యథాగతం గమిష్యామి । తవ ప్రతిజ్ఞా మిథ్యా । మిథ్యాప్రతిజ్ఞః త్వం కథం సుఖీ భవిష్యసి?"

8. నేను ఎలా వచ్చానో అలా వెళ్ళిపోతాను. నీవు మాట ఇవ్వడం ఒక బూటకము. దొంగ ప్రతిజ్ఞలు చేసేవాడివి నీవు ఎలా సుఖపడతావు?"

౯. ఇతి ఉక్త్వా సః క్రుద్ధః మునిః గన్తుమ్ ఇచ్ఛతి ॥

9. అని పలికి కోపించిన ఆ ముని పోవుటకు ఇచ్చగించాడు (పోబోయాడు).

--*--

# (౧౨) ద్వాదశః పాఠః – పన్నెండవ పాఠము

౧. అస్తి దశరథస్య కులగురుః వసిష్ఠః నామ।

1. దశరథుడికి వసిష్ఠుడని పేరు గల కులగురువు ఉన్నాడు.

౨. క్రుద్ధం విశ్వామిత్రం దృష్ట్వా, సః రాజానం వదతి– "రాజన్ దశరథ, న ఏతత్ తవ ఉచితమ్।

2. కోపముతోనున్న విశ్వామిత్రుడిని చూసి, అతడు రాజుతో అంటాడు– "రాజా దశరథా, నీకిది తగదు.

౩. తవ ప్రతిజ్ఞా మిథ్యా మా భవతు।

3. నీవు ఇచ్చిన మాట కల్ల కాకూడదు.

౪. సత్యప్రతిజ్ఞః భవ। త్వం క్షత్రియః అసి।

4. మాట నిలబెట్టుకునేవాడివి కమ్ము. నీవు క్షత్రియుడవు.

౫. స్వధర్మం మా త్యజ।

5. నీ ధర్మాన్ని విడిచిపెట్టవద్దు.

౬. యజ్ఞస్య రక్షణం కురు।

6. యజ్ఞము యొక్క రక్షణము చేయుము.

౭. మునయే విశ్వామిత్రాయ రామం ప్రయచ్ఛ।

7. విశ్వామిత్రమునికి రాముడిని ఇమ్ము.

౮. విశ్వామిత్రేణ రక్షితం రామం పీడయితుం రాక్షసాః న సమర్థాః।

8. విశ్వామిత్రుడి చేత రక్షించబడుతున్న రాముడిని పీడించుట రాక్షసుల వల్లకాదు.

౯. ఏషః మునిః వివిధాని అస్త్రాణి జానాతి।

9. ఈ మునికి రకరకాల అస్త్రాలు తెలుసును.

౧౦. రక్షణం కురు। సర్వమ్ అపి రామస్య హితాయ భవిష్యతి।

10. రక్షణము చేయుము (అందుకు ఒప్పుకో). అంతా రాముడి మంచికే అవుతుంది.

౧౧. తస్య భయం న విద్యతే। సంశయం త్యజ।

11. అతడి (గురించి) భయము లేదు. సంశయమును విడిచిపెట్టుము.

౧౨. ప్రతిజ్ఞాభఙ్గం మా కురు।" ఇతి॥

12. మాటను వమ్ము కానివ్వవద్దు." అని.

--*--

# (౧౩) త్రయోదశః పాఠః – పదమూడవ పాఠము

౧. వసిష్ఠస్య తద్ వచనం శ్రుత్వా, నృపః విశ్వామిత్రం వదతి– "భగవన్, మాం క్షమస్వ। రామం తే దాస్యామి" ఇతి।

1. వశిష్ఠుడి ఆ మాటను విని, రాజు విశ్వామిత్రుడితో ఇలా అంటాడు– "స్వామీ, నన్ను క్షమించు. రాముడిని నీకు ఇస్తాను." అని.

౨. అనేన దశరథస్య వచనేన వసిష్ఠ–విశ్వామిత్రౌ ప్రసన్నౌ భవతః।

2. దశరథుడి ఈ మాటతో వసిష్ఠవిశ్వామిత్రులు ఇద్దరూ ప్రసన్నులు అవుతారు.

౩. రాజా దశరథః రామమ్ ఆహ్వయతి।

3. దశరథమహారాజు రాముడిని పిలుస్తాడు.

౪. రామః శీఘ్రమ్ ఆగచ్ఛతి।

4. రాముడు వెంటనే వస్తాడు.

౫. రామేణ సహ లక్ష్మణః అపి ఆగచ్ఛతి।

5. రాముడితో కలిసి లక్ష్మణుడు కూడా వస్తాడు.

౬. అగ్రతః రామః ఆగతః, తస్య పృష్ఠతః చ లక్ష్మణః।

6. ముందు రాముడు వచ్చాడు. అతడి వెనక లక్ష్మణుడు కూడా.

౭. నృపః ప్రియం పుత్రం రామం తథా ఏవ లక్ష్మణం చ విశ్వామిత్రాయ ప్రయచ్ఛతి।

7. రాజు ప్రియపుత్రుడైన రాముడిని అలాగే లక్ష్మణుడిని కూడా విశ్వామిత్రుడికి అప్పగిస్తాడు.

౮. తేన విశ్వామిత్రః సన్తుష్టః భవతి ।

8. దానితో విశ్వామిత్రుడు సంతుష్టుడు అవుతాడు.

౯. రామలక్ష్మణౌ విశ్వామిత్రం నమతః ।

9. రామలక్ష్మణులిరువురూ విశ్వామిత్రుడికి నమస్కరిస్తారు.

౧౦. సః అపి హస్తౌ ఉద్యమ్య, తాభ్యామ్ ఆశీర్వచనం యచ్ఛతి ॥

10. అతడు కూడా రెండు చేతులను పైకెత్తి వారిద్దరికీ ఆశీర్వాదాన్ని ఇస్తాడు.

--*--

# (౧౪) చతుర్దశః పాఠః – పదునాల్గవ పాఠము

౧. ఏషః శ్యామలః బాలకః రామః ।

1. ఈ నల్లని పిల్లవాడు రాముడు.

౨. అయం చ గౌరః బాలకః లక్ష్మణః ।

2. ఇంకా, ఈ ఎఱ్ఱని కుఱ్ఱవాడు లక్ష్మణుడు.

౩. రామలక్ష్మణౌ విశ్వామిత్రస్య అగ్రతః తిష్ఠతః ।

3. రామలక్ష్మణులిద్దరు విశ్వామిత్రుడి ఎదురుగా ఉన్నారు.

౪. ద్వౌ అపి అఞ్జలిం బద్ధ్వా విశ్వామిత్రం నమతః ।

4. ఇద్దరూ చేతులు జోడించి విశ్వామిత్రుడికి నమస్కరిస్తున్నారు.

౫. రామలక్ష్మణయోః దక్షిణతః గురుః వసిష్ఠః తిష్ఠతి, తయోః పృష్ఠతః చ రాజా దశరథః ।

5. రామలక్ష్మణులకిరువురికీ కుడివైపున గురువైన వసిష్ఠుడు ఉన్నాడు. మరియు, వారిద్దరి వెనక దశరథమహారాజు.

౬. వసిష్ఠదశరథయోః పృష్ఠతః చ సింహాసనం వర్తతే ।

6. మరియు, వసిష్ఠదశరథులిరువురి వెనక సింహాసనము ఉన్నది.

౭. సింహాసనస్య ఉపరి ఛత్రం చ భవతి ।

7. సింహాసనము మీద ఛత్రము (గొడుగు) ఉన్నది.

౮. తస్య వామతః ఏకః కిఙ్కరః తిష్ఠతి ।

8. దానికి ఎడమవైపున ఒక సేవకుడు ఉన్నాడు.

౯. తస్య హస్తే చామరమ్ అస్తి ।

9. అతడి చేతిలో చామరము (వింజామర) ఉన్నది.

౧౦. సింహాసనస్య దక్షిణతః అన్యస్య కిఙ్కరస్య హస్తః ఏవ దృశ్యతే ।

10. సింహాసనపు కుడిపక్కన మరొక సేవకుడి చేయి మాత్రమే కనబడుతున్నది.

౧౧. తస్మిన్ హస్తే అపి అన్యత్ చామరం భవతి ।

11. ఆ చేతిలో కూడా ఇంకొక వింజామర ఉన్నది.

౧౨. ఛత్రం చ ద్వే చామరే చ రాజచిహ్నాని ।

12. ఏ ఛత్రము, రెండు చామరాలు రాచరికపు గుర్తులో (అవి).[5]

౧౩. విశ్వామిత్రస్య పార్శ్వతః అపి తృతీయః కిఙ్కరః భవతి ।

13. విశ్వామిత్రుడి పక్కన మూడవ సేవకుడు ఉన్నాడు.

౧౪. సర్వే ప్రసన్నాః దృశ్యన్తే ॥

14. అందరూ సంతోషంగా కనబడుతున్నారు.

--*--

[5] 7 – 12 దాకా కలిపి ఒక్క వాక్యం: 'రాచరికపు గుర్తులైన ఛత్రమును, చామరములను చూడవచ్చును.' అని.

# (౧౫) పఞ్చదశః పాఠః — పదిహేనవ పాఠము

౧. రామస్య శీర్షే ముకుటం, కణ్ఠే హారః, పృష్ఠే చ తూణీరః ।

1. రాముని తలపై కిరీటము, మెడలో దండ, వీపున అమ్ములపొది.

౨. తూణీరే చ బాణాః దృశ్యన్తే ।

2. అమ్ములపొదిలో బాణాలు కనబడుతున్నాయి.

౩. లక్ష్మణస్య అపి శీర్షే కణ్ఠే పృష్ఠే చ ముకుట–హార–తూణీరాః దృశ్యన్తే ।

3. లక్ష్మణుడికి కూడా తలపై, మెడలో, వీపున కిరీటము, దండ, అమ్ములపొది కనబడుతున్నాయి.

౪. తథా చ దశరథస్య అపి ।

4. అలాగే దశరథుడికి కూడా.

౫. రామలక్ష్మణౌ బాలకౌ ఏవ దృశ్యేతే ।

5. రామలక్ష్మణులు ఇరువురు బాలకులవలెనే కనబడుతున్నారు.

౬. దశరథః తు బలవాన్ దృశ్యతే।

6. దశరథుడు మాత్రము బలవంతుడిలా కనబడుతున్నాడు.

౭. విశ్వామిత్రస్య మస్తకే జటాః వర్తన్తే, తథా చ వసిష్ఠస్య అపి ।

7. విశ్వామిత్రుడి తలపై జడలు ఉన్నాయి, అలాగే వసిష్ఠుడికి కూడా.

౮. తయోః ముఖయోః ప్రభూతాః కేశాః వర్తన్తే ।

8. వారిద్దరి ముఖములలో చాలా వెంట్రుకలు ఉన్నాయి.

౯. వసిష్ఠస్య కూర్చః దీర్ఘః, ధవలః చ ।

9. వసిష్ఠుడి గడ్డము పొడవైనది, తెల్లనిది కూడా.

౧౦. విశ్వామిత్రస్య అపి కూర్చః దీర్ఘః అస్తి ।

10. విశ్వామిత్రుడి గడ్డము కూడా పొడుగ్గా ఉన్నది.

౧౧. న తు తాదృశః ధవలః యాదృశః వసిష్ఠస్య ।

11. వసిష్ఠుడి గడ్డము ఎంత తెల్లగా ఉన్నదో అంత (తెల్లగా) లేదు.

౧౨. ఏకః పృష్ఠే అజినం ధారయతి, అన్యః తు క్షౌమమ్ ।

12. ఒకడు వీపున తోలును ధరించాడు, మరొకడు మాత్రము నారబట్టను (తొడుగుకొన్నాడు).

౧౩. యః కిఙ్కరః విశ్వామిత్రస్య పార్శ్వే తిష్ఠతి, తస్య హస్తే దణ్డః వర్తతే ।

13. ఏ సేవకుడు విశ్వామిత్రుడి పక్కన ఉన్నాడో, అతడి చేతిలో కఱ్ఱ ఉన్నది.

౧౪. సః పృష్ఠే కార్పాసం వస్త్రం ధారయతి ।

14. అతడు వీపున పత్తితో చేసిన బట్టను ధరించాడు.

౧౫. తస్య శిరోవస్త్రమ్ అపి కార్పాసమ్ అస్తి ।

15. అతడి తలపాగా కూడా పత్తితో చేసినదే.

౧౬. తస్య కూర్చః హ్రస్వః కృష్ణః చ ॥

16. అతడి గడ్డము పొట్టిది, నల్లది కూడా.

--*--

# (౧౬) షోడశః పాఠః — పదహారవ పాఠము

౧. దశరథేన రామః విశ్వామిత్రాయ దత్తః ।

1. దశరథుడి చేత రాముడు విశ్వామిత్రుడికి అప్పగించబడ్డాడు.

౨. తేన సహ విశ్వామిత్రః వనాయ ప్రస్థితః ।

2. అతడితో సహా విశ్వామిత్రుడు అడవికి ప్రయాణమయ్యాడు.

౩. మునిః అగ్రతః యాతి, తస్య పృష్ఠతః చ రామః చాపం గృహీత్వా గచ్ఛతి ।

3. ముని ముందుగా నడుస్తున్నాడు, అతడి వెనక విల్లును పట్టుకొని రాముడు కూడా వెళుతున్నాడు.

౪. తస్య పృష్ఠే తూణీరః వర్తతే ।

4. రాముడి వీపున అమ్ముల పొది ఉన్నది.

౫. రామః వనం గచ్ఛతి ।

5. రాముడు అడవికి వెళుతున్నాడు.

౬. తదా లక్ష్మణః అపి తమ్ అనుగచ్ఛతి ।

6. అప్పుడు లక్ష్మణుడు కూడా అతడిని అనుసరిస్తున్నాడు.

౭. తస్య అపి హస్తే ధనుః వర్తతే, పృష్ఠే చ తూణీరః ।

7. అతడి చేతిలో కూడా విల్లు ఉన్నది, వీపున అమ్ముల పొది కూడా.

౮. తూణీరే చ బాణాః వర్తన్తే ।

8. మరియు, అమ్ముల పొదిలో బాణాలు ఉన్నాయి.

౯. క్రోశద్వయం గత్వా సరయూం నదీం పశ్యన్తి ।

9. రెండు క్రోసులు (ఎనిమిది కిలోమీటర్లు) వెళ్ళి సరయూ నదిని చూస్తారు.

౧౦. నద్యాం ప్రభూతం నిర్మలం జలం వర్తతే ।

10. నదిలో నిర్మలమైన నీరు చాలా ఉన్నది.

౧౧. విశ్వామిత్రః రామమ్ అభిభాషతే– "వత్స రామ, ఇయం నదీ సరయూః నామ ।

11. విశ్వామిత్రుడు రాముడితో అంటున్నాడు– "నాయనా రామా, ఇది సరయూ అనే నది.

౧౨. అస్యాః నద్యాః శోభాం పశ్య ।" ఇతి ॥

12. ఈ నదియొక్క సొబగును చూడుము." అని.

--*--

# (౧౭) సప్తదశః పాఠః — పదిహేడవ పాఠము

౧. ఋషిః భాషతే– "అస్యాం నద్యాం ప్రభూతం జలం వర్తతే ।

1. ఋషి అంటున్నాడు– "ఈ నదిలో చాలా నీరు ఉన్నది.

౨. జలం చ స్వచ్ఛమ్ అస్తి ।

2. నీరు తేటగా కూడా ఉన్నది.

౩. వత్స రామ, హస్తే గృహాణ ।

3. "నాయనా రామా, చేతిలోకి తీసుకో.

౪. అహం తే అస్త్ర–విద్యాం దాస్యామి ।

4. నేను నీకు అస్త్రవిద్యను ఇవ్వబోతున్నాను.

౫. ఇమాం విద్యాం శిక్షస్వ ।

5. ఈ విద్యను నేర్చుకో.

౬. అనయా విద్యయా త్వం సర్వాన్ శత్రూన్ విజేష్యసే ।

6. ఈ విద్యతో నీవు శత్రువులనందరినీ జయిస్తావు.

౭. న చ తే క్షుధా, పిపాసా వా భవిష్యతి ।

7. ఆకలీ, దప్పికా కూడా కలగవు.

౮. శీఘ్రం జలం స్పృశ ।

8. వెంటనే నీటిని ముట్టుకో.

౯. కాలక్షేపం మా కురు ।" ఇతి ।

9. జాగు చేయవద్దు." అని.

౧౦. రామః ప్రసన్నః భవతి, నద్యాః జలం హస్తేన స్పృశతి, ఋషిణా దత్తాం విద్యాం శిక్షతే చ ।

10. రాముడు ప్రసన్నుడవుతాడు, నది యొక్క నీటిని చేతితో తాకుతాడు. ఋషి చేత ఇవ్వబడిన చదువును నేర్చుకుంటాడు కూడా.

౧౧. తేన ఋషిః అపి ప్రసన్నః భవతి ।

11. దానితో ఋషి కూడా ప్రసన్నుడవుతాడు.

౧౨. భగవాన్ సూర్యః పశ్చిమాయాం దిశాయామ్ అస్తం గచ్ఛతి ।

12. సూర్యభగవానుడు పడమట దిక్కున అస్తమిస్తాడు.

౧౩. అయం సన్ధ్యాకాలః ప్రాప్తః ।

13. సాయంకాలమయ్యింది.

౧౪. సన్ధ్యావన్దనార్థమ్ ఋషయః నద్యాం స్నానం కుర్వన్తి ।

14. సంధ్య వార్చేందుకు ఋషులు నదిలో స్నానం చేస్తారు.

౧౫. త్రయః, విశ్వామిత్రః రామః లక్ష్మణః చ తాం రాత్రిం నద్యాం నయన్తి ॥

15. విశ్వామిత్రుడు, రాముడు,లక్ష్మణుడు ముగ్గురు కూడా ఆ రాత్రిని నదిలో (నది ఒడ్డున) గడుపుతారు.

--*--

# (౧౮) అష్టాదశః పాఠః – పద్దెనిమిదవ పాఠము

౧. "వత్స రామ, శయనం త్యక్త్వా ఉత్తిష్ఠ ।

1. "నాయనా రామా, నిద్ర విడిచి లెమ్ము.

౨. ప్రాప్తః అయం ప్రభాతకాలః ।

2. ఇదిగో, తెల్లవారింది.

౩. నక్షత్రాణి ఆకాశే న దృశ్యన్తే ।

3. నక్షత్రాలు ఆకాశంలో కనబడటం లేదు.

౪. అయం భగవాన్ సూర్యః పూర్వస్యాం దిశాయామ్ ఉదయతి ।

4. ఇదిగో, సూర్యభగవానుడు తూర్పు దిక్కున ఉదయిస్తున్నాడు.

౫. శీఘ్రం భగవన్తం భాస్కరం పశ్య, తం నమ, దినకృత్యాని చ ఆరభస్వ ।

5. వెంటనే భగవంతుడైన భాస్కరుడిని చూడుము. అతడికి నమస్కరించుము. నీ రోజువారీ పనులను మొదలుపెట్టుము.

౬. వత్స లక్ష్మణ, త్వమ్ అపి తత్ ఏవ కురు ।"

6. నాయనా లక్ష్మణా, నీవు కూడా అలాగే చేయుము."

౭. విశ్వామిత్రస్య తత్ వచనం శ్రుత్వా, రామః శయనాత్ ఉత్తిష్ఠతి, స్నానం చ కరోతి ।

7. విశ్వామిత్రుడి ఆ మాటను విని, రాముడు నిద్ర నుంచి లేస్తాడు, స్నానం చేస్తాడు కూడా.

౮. తథా చ లక్ష్మణః అపి ।

8. అలాగే లక్ష్మణుడు కూడా.

౯. తదనన్తరం ప్రభాతకరణీయాని కృత్వా, విశ్వామిత్రఞ్చ నమస్కృత్య, తేన సహ వనం గన్తుం ద్వౌ అపి ఉద్యతౌ ।

9. ఆ తరువాత పొద్దున చేయాల్సిన పనులు చేసి, విశ్వామిత్రుడికి నమస్కరించి, అతడితో కలిసి అడవికి వెళ్ళేందుకు ఇద్దరూ తయారవుతారు.

౧౦. వనం గచ్ఛన్తః తే మార్గే గఙ్గాయాః సరయ్వాః చ సఙ్గమం పశ్యన్తి ॥

10. అడవికి వెళుతూ ఉన్న వారు (ముగ్గురూ) తోవలో గంగ–సరయూ నదుల కలయికను (సంగమస్థానాన్ని) చూస్తారు.

--*--

# (19) ఏకోనవింశః పాఠః — పందొమ్మిదవ పాఠము

౧. మునిః అభాషత– “వత్సౌ, పశ్యతమ్ ఇదం గఙ్గాయాః దక్షిణే తీరే తాటకాయాః దారుణం వనమ్ ।” ఇతి ।

1. ముని అన్నాడు– “నాయనలారా, ఇదిగో చూడండి మీరిరువురూ, గంగ యొక్క కుడి ఒడ్డున తాటక యొక్క భయంకరమైన అడవిని.” అని.

౨. రామః అపృచ్ఛత్–"కా ఇయం తాటకా?” ఇతి ।

2. రాముడు అడిగాడు–"ఎవరీ తాటక?” అని.

౩. మునిః ప్రత్యభాషత–“ఇయం తాటకా సున్దస్య రాక్షసస్య భార్యా ।

3. ముని బదులు పలికాడు –“ఈ తాటక సుందుడనే రాక్షసుడి భార్య.

౪. పురా ఏషః జనపదః ధనధాన్యసమ్పన్నః ఆసీత్ ।

4. పూర్వము ఈ పల్లెపట్టు ధనధాన్యాలతో నిండి ఉండేది.

౫. అథ గచ్ఛతా కాలేన, ఇయం రాక్షసీ అత్ర ఆగతా ।

5. అట్లా కొంత కాలం గడిచాక, ఈ రాక్షసి ఇక్కడికి వచ్చింది.

౬. తస్యాః పుత్రః మారీచః నామ నిత్యం ప్రజాః త్రాసయతే ।

6. ఆమె యొక్క కొడుకు మారీచుడు అనేవాడు ఎల్లప్పుడూ ప్రజలను పీడిస్తూ ఉంటాడు.

౭. సా చ తస్య దుష్టా మాతా తాటకా ఇమం జనపదం వినాశయతి ।

7. చెడ్డదైన అతడి తల్లి–ఆ తాటక–కూడా ఈ జనపదాన్ని నాశనం చేస్తూ ఉంటుంది.

౮. సా మార్గమ్ ఆవృత్య అత్ర వసతి ।

8. ఆమె దారిని కమ్ముకొని (ఆక్రమించి) ఇక్కడ నివసిస్తుంది.

౯. ఈదృశమ్ ఉత్సాదితం దేశమ్ ఆగన్తుం కః అపి న శక్తః ।

9. ఈవిధముగా పాడుబెట్టబడిన ఈ ప్రాంతానికి వచ్చేందుకు ఎవడూ సమర్థుడు కాడు.

౧౦. తస్మాత్ మారయ ఏనాం దుష్టామ్ ।

౧౦. అందుచేత ఈ దుష్టురాలిని చంపుము.

౧౧. ఇమం దేశఞ్చ పూర్వవత్ నిష్కణ్టకం కురు ।" ఇతి ॥

౧౧. ఈ ప్రాంతాన్ని ఇంతకు ముందులా ప్రమాదరహితముగా చేయుము" అని.

--*--

# (౨౦) వింశః పాఠః – ఇరవయ్యవ పాఠము

౧. రామః వదతి–"భగవన్, ఇయం తాటకా రాక్షసీ అపి నారీ అస్తి ।

1. రాముడన్నాడు–"స్వామీ, ఈ తాటక రాక్షసి అయినా స్త్రీ (కదా)!

౨. కథం ను అహం నారీం మారయేయమ్!" ఇతి ।

2. ఎట్లా నేను స్త్రీని సంహరించగలను?" అని

౩. మునిః ప్రతిభాషతే–"మా మైవమ్ ।

3. ముని మారు పలికాడు –"కాదు, అలా కాదు.

౪. ఏషా నారీ అపి దుష్టా, పరమదారుణా చ ।

4. ఈమె స్త్రీ అయినప్పటికీ దుష్టురాలు. క్రూరురాలు కూడా.

౫. త్వామ్ ఋతే న కశ్చిత్ ఏనాం దణ్డయితుం శక్తః ।

5. నీవు తక్క మరెవ్వరూ ఈమెను శిక్షించుటకు సమర్థులు కారు.

౬. 'నారీవధః అయం' ఇతి శఙ్కా న కార్యా ।

6. 'స్త్రీవధ ఇది' అన్న శంకించుట తగదు.

౭. న వా ఇయం దయామ్ అర్హతి ।

7. ఈమె దయకు అర్హురాలు కాదు కూడా.

౮. ధర్మః ఏవ క్షత్రియస్య దుష్టానాం దణ్డనమ్ ।

8. దుష్టులకు దండన క్షత్రియధర్మమే (కదా).

౯. తాటకా చ అతీవ దుష్టా ।

9. తాటక చాలా చెడ్డది కూడా.

౧౦. నిఃశఙ్కం తాం మారయ ।

10. ఏ శంక (సంశయము) లేకుండా తనను చంపివేయుము.

౧౧. పురా అపి బహుభిః రాజపుత్రైః ధర్మరహితాః దుష్టాః నార్యః హతాః ।" ఇతి ।

11. పూర్వము కూడా రాజకుమారులనేకులచేత ధర్మము లేని దుష్టస్త్రీలు వధించబడ్డారు." అని.

౧౨. రామః వదతి–"భగవన్, భవతః వచనం ప్రమాణమ్ ।

12. రాముడన్నాడు–"దేవా, మీ మాటయే ప్రమాణము.

౧౩. తాటకాం హనిష్యామి ।" ఇతి ॥

13. తాటకను చంపుతాను." అని.

--*--

# (౨౧) ఏకవింశః పాఠః – ఇరవై ఒకటవ పాఠము



౧. ఇదమ్ ఆలేఖ్యం తాటకాయాః వనస్య ।

1. ఇది తాటకకు చెందిన వనము యొక్క చిత్రము.

౨. అస్మిన్ బహవః వృక్షాః సన్తి ।

2. ఇందులో చాలా చెట్లు ఉన్నాయి.

౩. వృక్షాణాం స్కన్ధేషు శాఖాః వర్తన్తే, శాఖాసు చ పర్ణాని ।

3. చెట్ల యొక్క కాండములకు కొమ్మలు ఉన్నాయి, మరియు కొమ్మలకు ఆకులు (ఉన్నాయి).

౪. వృక్షాన్ గణయామి ।

4. చెట్లను లెక్కబెడతాను.

౫. అత్ర ద్వాదశ వృక్షాః దృశ్యన్తే ।

5. ఇక్కడ పన్నెండు చెట్లు కనబడుతున్నాయి.

౬. దక్షిణతః ఏకః । వామతః చ ఏకః, ద్వౌ, త్రయః, చత్వారః, పఞ్చ, షట్, సప్త, అష్టౌ, నవ, దశ, ఏకాదశ వృక్షాః సన్తి ।

6. కుడివైపున–ఒకటి. ఎడమవైపున ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది... పదకొండు చెట్లు ఉన్నాయి.

౭. దూరే తాటకా దృశ్యతే ।

7. దూరంలో తాటక కనబడుతున్నది.

౮. తస్యాః దక్షిణే హస్తే ఖడ్గః, వామే హస్తే చ ఫలకః ।

8. తన కుడిచేతిలో కత్తి, ఎడమచేతిలో డాలు (ఉన్నాయి).

౯. వామతః యః ప్రథమః వృక్షః భవతి, తస్య అధస్తాత్ మునిః విశ్వామిత్రః తిష్ఠతి ।

9. ఎడమవైపున ఏ చెట్టు మొదటన ఉన్నదో, దాని క్రింద విశ్వామిత్రముని ఉన్నాడు.

౧౦. తత్ర చ ద్వౌ చాపధరౌ కుమారౌ అపి తిష్ఠతః ।

10. ఇంకా అక్కడ విల్లును పట్టుకొని ఉన్న ఇద్దరు బాలురు కూడా ఉన్నారు.

౧౧. తౌ రాజపుత్రౌ రామలక్ష్మణౌ, శ్యామలః రామః, గౌరః చ లక్ష్మణః ।

11. ఆ ఇరువురు రాజకుమారులు రామలక్ష్మణులు, నల్లనివాడు రాముడు, ఎర్రనివాడేమో లక్ష్మణుడు.

౧౨. తయోః చాపయోః మౌర్వ్యౌ అపి దృశ్యేతే ।

12. వారిరువురి విండ్ల యొక్క నారులు (అల్లె త్రాళ్ళు) కూడా కనబడుతున్నాయి.

౧౩. రామః మౌర్వ్యాం బాణమ్ ఆరోప్య, సన్ధానం చ కృత్వా, తాటకాం మారయతి ఇవ ।

13. రాముడు వింటినారికి బాణమును తొడిగి, ఎక్కుపెట్టి, తాటకను కొట్టుతున్నట్లు (కనబడుతున్నాడు).

౧౪. లక్ష్మణః తు కేవలం మౌర్వ్యాం బాణమ్ ఆరోప్య సజ్జః తిష్ఠతి ॥

14. లక్ష్మణుడు మాత్రము వింటినారికి బాణాన్ని తొడిగి సంసిద్ధముగా ఉన్నాడు.

--*--

# (౨౨) ద్వావింశః పాఠః – ఇరవై రెండవ పాఠము

౧. రామః బాణేన తాటకామ్ అమారయత్ ।

1. రాముడు బాణముతో తాటకిని చంపాడు.

౨. మృతాయాం చ తస్యామ్, ఇదం వనమ్ అధునా నిష్కణ్టకం భవతి ।

2. ఆమె మరణించడంతో ఈ అడవి ఇప్పుడు ఏ బాధలు లేనిది అవుతుంది.

౩. అద్య ప్రభృతి జనపదః సుఖీ భవిష్యతి, యతః తాటకా తం న వినాశయిష్యతి ।

3. ఈ రోజు నుంచి ఈ పల్లెపట్టు సుఖముగా ఉండనున్నది ఎందుకంటే తాటక దానిని నాశనము చేయబోదు.

౪. తాటకాయాః వధేన విశ్వామిత్రః ప్రసన్నః అభవత్ ।

4. తాటక వధతో విశ్వామిత్రుడు ప్రీతి చెందాడు.

౫. సః రామాయ బహూని అస్త్రాణి ప్రయచ్ఛతి ।

5. అతడు రాముడికి చాలా అస్త్రాలను ఇస్తాడు.

౬. తాని అస్త్రాణి ప్రతిగృహ్య రామః వదతి– "భగవన్, ఆశ్రమం తే శీఘ్రం గచ్ఛామ ।

6. ఆ అస్త్రాలను తీసుకొని రాముడు అంటాడు–"స్వామీ, మీ ఆశ్రమమునకు వెంటనే వెళదాము.

౭. కుత్ర తే దుష్టాః రాక్షసాః, యే తవ యజ్ఞస్య విఘ్నకరాః భవన్తి? అహం తత్ర గత్వా యజ్ఞం రక్షిష్యామి ।" ఇతి ।

7. మీ యజ్ఞమునకు విఘ్నములు కల్పించే ఆ దుష్టరాక్షసులు ఎక్కడ ఉంటారు? నేను అక్కడికి వెళ్ళి యజ్ఞమును రక్షిస్తాను." అని.

౮. తతః తే త్రయః అపి సిద్ధాశ్రమం నామ విశ్వామిత్రస్య ఆశ్రమం గచ్ఛన్తి ।

8. అప్పుడు ఆ ముగ్గురూ సిద్ధాశ్రమము అనే పేరు గల విశ్వామిత్రుడి ఆశ్రమానికి వెళ్తారు.

౯. తేన ఆశ్రమవాసినః మునయః సన్తుష్టాః భవన్తి ॥

9. అందుచేత ఆశ్రమములో నివసించేవారైన మునులు సంతోషిస్తారు.

--*--

# (౨౩) త్రయోవింశః పాఠః — ఇరవై మూడవ పాఠము

౧. ఆశ్రమవాసినః అర్ఘ్యేణ విశ్వామిత్రమ్ అపూజయన్, రాజపుత్రయోః అతిథి–క్రియాం చ అకుర్వన్ ।

1. ఆశ్రమవాసులు అర్ఘ్యముతో విశ్వామిత్రుడిని పూజించారు, రాజకుమారులకు అతిథిమర్యాదలు చేసారు కూడా.

౨. రాజపుత్రౌ విశ్వామిత్రమ్ అవదతామ్– "అద్య ఏవ భవాన్ దీక్షాం గృహ్ణాతు ।

2. రాజపుత్రులు ఇరువురు విశ్వామిత్రుడితో అన్నారు– "నేడే మీరు దీక్షను తీసుకొండి.

౩. విఘ్నకరాః చ తే రాక్షసాః కదా నివారణీయాః తత్ నౌ కథయతు ।" ఇతి ।

3. ఆటంకములను కలిగించే ఆ రాక్షసులను ఎప్పుడు అడ్డుకోవాలో మా ఇద్దరికి చెప్పండి." అని.

౪. మునిః ప్రత్యభాషత–"అద్య దీక్షాం గమిష్యామి ।

4. ముని మారు పలికాడు–"నేడు దీక్ష వహిస్తాను.

౫. అద్య ప్రభృతి షట్ దినాని యువాం తపోవనం రక్షతమ్ ।

5. నేటి నుండి ఆరు దినములు మీరిద్దరు తపోవనాన్ని రక్షించండి.

౬. అహం తు మౌనం ధారయిష్యామి ।" ఇతి ।

6. నేను ఇక మౌనం వహిస్తాను." అని.

౭. మునేః తత్ వచనం శ్రుత్వా, రామలక్ష్మణౌ అనిద్రౌ షఋ దినాని తపోవనమ్ అరక్షతామ్ ।

7. ముని యొక్క ఆ పలుకును విన్నాక, రామలక్ష్మణులు ఇరువురూ నిద్ర లేకుండా అయిదు రోజులు ఆ తపోవనాన్ని కాపాడారు.

౮. అథ షష్ఠే దినే ప్రాప్తే, రామః లక్ష్మణమ్ అవదత్– "తాత, లక్ష్మణ, సమాహితః భవ।" ఇతి।

8. అటు పిమ్మట ఆరవ రోజున రాముడు లక్ష్మణుడితో అన్నాడు–"నాయనా, లక్ష్మణా, సావధానముగా ఉండుము." అని.

౯. పురోహితః వేద్యామ్ అగ్నిమ్ అజ్వలయత్।

9. పురోహితుడు యజ్ఞవేదిలో అగ్నిని స్థాపించాడు.

౧౦. యథాన్యాయం చ యజ్ఞః సమ్ప్రవర్తితః అభవన్।

10. సరైన పద్ధతి ప్రకారం యజ్ఞం కొనసాగింది.

౧౧. తస్మిన్ ఏవ క్షణే కశ్చిత్ భయానకః మహాన్ శబ్దః ఆకాశే ప్రాదురాసీత్॥

11. ఆ క్షణాననే ఏదో భయంకరమైన పెద్ద చప్పుడు ఆకాశంలో (నుంచి) పుట్టుకువచ్చింది.

--*--

# (౨౪) చతుర్వింశః పాఠః – ఇరవై నాల్గవ పాఠము



౧. అయం పరిసరః ఆశ్రమపదస్య ।

1. ఇది ఆశ్రమస్థలపు పరిసరప్రాంతము.

౨. అత్ర అష్టౌ కుటీరాః దృశ్యన్తే ।

2. ఇక్కడ ఎనిమిది కుటీరాలు కనబడుతున్నాయి.

౩. తథా చ త్రయః దేవాలయాః అపి ।

3. అలాగే మూడు దేవాలయాలు కూడా.

౪. త్రయాణాం దేవాలయానాం త్రీణి శిఖరాణి దృశ్యన్తే ।

4. మూడు దేవాలయాల యొక్క మూడు శిఖరాలు కనబడుతున్నాయి.

౫. ఆకాశే మారీచః సుబాహుః చ దృశ్యేతే ।

5. ఆకాశంలో మారీచుడు మరియు సుబాహుడు కనబడుతున్నారు.

౬. తయోః అనుచరాః తు ఆలేఖ్యే న దృశ్యన్తే ।

6. వారిరిరువురి అనుచరులు చిత్రంలో కనబడడం లేదు.

౭. తేషాం భయానకాత్ శబ్దాత్ త్రస్తాః పక్షిణః ఆకాశే ఉడ్డయన్తే ।

7. వారి (ఆ రాక్షసుల) భయంకరమైన చప్పుడుతో పీడించబడ్డ పక్షులు ఆకాశంలో ఎగురుతున్నాయి.

౮. ఏతే ఆశ్రమవాసినః కిమర్థం కుటీరేభ్యః బహిః ఆగతాః? రాక్షసానాం భయానకః శబ్దః ఏవ తేషాం నిర్గమనస్య కారణమ్ ।

8. ఈ ఆశ్రమవాసులు ఎందుకు గుడిసెల నుండి బయటకు వచ్చారు? రాక్షసుల భయంకరమైన శబ్దమే వారు బయటకు రావడానికి కారణము.

౯. యదా రాక్షసాః ఆశ్రమపదం త్రాసయన్తే, తదా ఆశ్రమ–వాసినః భీతాః భవన్తి ।

9. ఎప్పుడైతే, రాక్షసులు ఆశ్రమప్రాంతమును పీడిస్తూ ఉంటారో, అప్పుడు ఆశ్రమవాసులు భయపడుతూ ఉంటారు.

౧౦. ఇదానీం తు రాక్షసేభ్యః ఆశ్రమవాసినాం భయం న విద్యతే, యతః రాక్షసైః సహ యోద్ధుం రామః సజ్జః తిష్ఠతి ।

10. ఇప్పుడైతే రాక్షసుల నుంచి ఆశ్రమవాసులకు భయము లేదు, ఎందుకంటే రాక్షసులతో యుద్ధం చేసేందుకు రాముడు సిద్ధముగా ఉన్నాడు.

౧౧. వామేన హస్తేన చాపం గృహీత్వా, దక్షిణేన హస్తేన జ్యాయాం బాణమ్ ఆరోప్య, తాం చ ఆకర్ణమ్ ఆకృష్య, సః మారీచస్య శరీరే బాణం క్షిపతి ।

11. ఎడమచేతితో వింటిని పట్టుకొని కుడిచేతితో వింటినారిపై బాణమును ఎక్కుపెట్టి దానిని (వింటి నారిని) చెవి వరకూ లాగి అతడు మారీచుడి ఒంటిపై బాణము వేస్తున్నాడు.

౧౨. లక్ష్మణః అపి రాక్షసేషు బహూన్ బాణాన్ అస్యతి ॥

12. లక్ష్మణుడు కూడా రాక్షసులపై ఎన్నో బాణాలను వేస్తున్నాడు.

--*--

# (౨౫) పఞ్చవింశః పాఠః — ఇరవై ఐదవ పాఠము

౧. బాణేన విద్ధః మారీచః భూమౌ అపతత్ ।

1. బాణముతో గాయపడిన మారీచుడు భూమిపై పడ్డాడు.

౨. తదా రామః లక్ష్మణమ్ అవదత్–"పశ్య, లక్ష్మణ, ఇమాన్ అన్యాన్ అపి యజ్ఞస్య విఘ్నకరాన్ హనిష్యామి ।" ఇతి ।

2. అప్పుడు రాముడు లక్ష్మణుడితో అన్నాడు–"చూడుము, లక్ష్మణా, యజ్ఞమునకు ఆటంకములు కలిగిస్తున్న తక్కిన వారిని కూడా చంపనున్నాను" అని.

౩. హతేషు విఘ్నకరేషు రాక్షసేషు, ఋషయః రామమ్ అపూజయన్ ।

3. విఘ్నకారులైన రాక్షసులు హతమవగా, ఋషులు రాముడిని పూజించారు.

౪. అథ సమాప్తే యజ్ఞే, మహామునిః విశ్వామిత్రః తమ్ అబ్రవీత్–"కృతం త్వయా గురువచనమ్ । కృతార్థః అస్మి అద్య ।" ఇతి ।

4. అటు పిమ్మట యజ్ఞము ముగుస్తున్న సమయములో, విశ్వామిత్రమహాముని అతడితో అన్నాడు –"గురువు చెప్పిన మాట (ఆదేశము) నీచేత నెరవేర్చబడింది. నా ప్రయోజనము నెరవేరింది." అని.

౫. తాం రాత్రిం భ్రాతరౌ రాజపుత్రౌ ఆశ్రమే ఏవ అవసతామ్ ।

5. ఆ రాత్రి అన్నదమ్ములైన ఆ రాజకుమారులిరువురూ ఆశ్రమములోనే ఉన్నారు.

౬. ప్రభాతాయాం రాత్ర్యాం, ప్రభాత-కరణీయాని కృత్వా, విశ్వామిత్రం చ నమస్కృత్య, తౌ అవదతామ్–"భగవన్, ఆవాం తే కిఙ్కరౌ సముపస్థితౌ ।

6. రాత్రి (గడిచి) తెల్లవారాక, పొద్దున చేయాల్సిన పనులను చేసి, ఇంక విశ్వామిత్రుడికి నమస్కరించి, ఆ ఇద్దరూ అన్నారు –"స్వామీ, మీ సేవకులమైన మేమిద్దరము మీ చెంత నిలిచాము.

౭. యథేష్టం నౌ ఆజ్ఞాపయ। తవ శాసనం కరిష్యావః।" ఇతి।

7. మీకు ఏది ఇష్టమో అది ఆజ్ఞాపించండి. మీ ఆజ్ఞను నెరవేరుస్తాము" అని.

౮. విశ్వామిత్రః ప్రత్యభాషత–"వత్స రామ, నిఃశేషం హతాః యజ్ఞస్య విఘ్నకరాః త్వయా।

8. విశ్వామిత్రుడు బదులు పలికాడు –"నాయనా రామా, యజ్ఞమును భంగము చేసేవారు ఒక్కరు మిగలకుండా నీచేత వధించబడ్డారు.

౯. అద్య వయం మిథిలాం గమిష్యామః।

9. నేడు మనము మిథిలకు వెళ్లనున్నాము.

౧౦. తత్ర జనకస్య యజ్ఞః భవిష్యతి।

౧౦. అక్కడ జనకుడి యజ్ఞము జరగనున్నది.

౧౧. అన్యత్ అపి అద్భుతమ్ మిథిలాయామ్ ద్రష్టవ్యమ్।

౧౧. ఇంకొక అద్భుతము కూడా మిథిలలో చూడదగినది (ఉన్నది).

౧౨. అనుసరతం యది అస్మాభిః సహ గమనే మతిః భవేత్।" ఇతి॥

౧౨. నన్ను అనుసరించండి, నా తోడుగా వెళ్ళాలని మీకు అనిపిస్తే." అని.

--*--

## (౨౬) షడ్వింశః పాఠః — ఇరవై ఆరవ పాఠము

౧. రామః అపృచ్ఛత్– "భగవన్, కిం ను తత్ అద్భుతం యత్ మిథిలాయాం ద్రష్టవ్యమ్? తత్ నౌ కథయ ।

1. రాముడు అడిగాడు–"స్వామీ, మిథిలలో చూడదగిన ఆ అద్భుతము ఏమి ? అది మా ఇద్దరికీ చెప్పండి.

౨. మహత్ హి ఆవయోః కౌతూహలమ్।" ఇతి ।

2. మా ఇద్దరికీ చాలా కుతూహలము (ఉన్నది)." అని.

౩. మునిః ప్రత్యభాషత– "వత్స రామ, శృణు ।

3. ముని మారుపలికాడు– "నాయనా రామా, విను.

౪. అస్తి ఖలు రాజ్ఞః జనకస్య అద్భుతం ధనుః ।

4. జనకమహారాజు దగ్గర అద్భుతమైన ధనుస్సు ఉన్నది.

౫. పురా తత్ శివేన జనకస్య పూర్వజాయ దత్తమ్ ।

5. చాలాకాలం క్రితం అది శివుడిచేత జనకుడి పూర్వీకుడికి ఈయబడినది.

౬. తత్ చ తత్ర విదేహానాం కులే న్యాసః ఇవ తిష్ఠతి । తస్య బలమ్ అప్రమేయమ్ ।

6. అప్పటినుంచి అది విదేహవంశస్థుల ఇంట నిక్షేపమువలె ఉన్నది. దాని బలము ఇంతింతనరానిది.

౭. తస్య ఆరోపణం కర్తుం పురా కే అపి న శక్తాః ।

7. దానిని ఎక్కుపెట్టుటకు శక్తులు మునుపు (ఇంతవరకు) ఎవరూ లేరు.

౮. తస్య ధనుషః బలం జ్ఞాతుకామాః కతిపయాః మహాబలాః రాజపుత్రాః మిథిలామ్ ఆగతాః ।

8. ఆ వింటి బలమెంతో తెలుసుకుందామనుకున్న కొందరు బలశాలులైన రాజకుమారులు మిథిలానగరానికి వచ్చారు.

౯. తత్ ఆరోపయితుం తు అసమర్థాః । అన్యత్ చ, రాజ్ఞః జనకస్య ఏకా కన్యా భవతి సీతా నామ ।

9. దానిని ఎక్కుపెట్టలేకపోయారు. ఇంకొకటి–జనకమహారాజుకు సీత అనే పేరుగల ఒక కుమార్తె ఉన్నది.

౧౦. తాం బహవః నృపాః వృణ్వన్తి ।

10. ఆమెను చాలా మంది రాజులు (వివాహమాడాలని) ఎంచుకుంటున్నారు.

౧౧. యః కోఽపి వీరః శివధనుః ఆరోప్య స్వబలం దర్శయిష్యతి, తస్మై ఏవ జనకః కన్యాం సీతాం దాస్యతి, న అన్యస్మై ।"

11. ఏ వీరుడైతే శివధనుస్సును ఎక్కుపెట్టి తన బలమును ప్రదర్శిస్తాడో, అతడికే జనకుడు సీత అనే ఆ కన్యను ఇస్తాడు, మరొకరికి కాదు."

౧౨. ఇతి ఉక్త్వా మునిశ్రేష్ఠః మిథిలామ్ ఉద్దిశ్య ప్రస్థానమ్ అకరోత్ ।

12. అని చెప్పి, మునిశ్రేష్ఠుడు మిథిల వైపుకు ప్రయాణించాడు.

౧౩. సలక్ష్మణః రామః అపి తమ్ అన్వగచ్ఛత్ ॥

13. లక్ష్మణుడితో సహా రాముడు సైతం అతడిని అనుసరించాడు.

--*--

# (౨౭) సప్తవింశః పాఠః — ఇరవై ఏడవ పాఠము

౧. అథ తే సర్వే అపి మిథిలాం ప్రాప్తాః, యజ్ఞవాటం చ ఉపాగతాః ।

1. అటు పిమ్మట వారందరూ మిథిలను చేరారు. యజ్ఞవాటికను సమీపించారు, కూడా.

౨. రామః అబ్రవీత్ –"అయం యజ్ఞవాటః ।

2. రాముడు అన్నాడు–"ఇది యజ్ఞవాటిక.

౩. అత్ర నానాదేశ–నివాసినః వేదాధ్యయనశాలినః బ్రాహ్మణాః ఆగతాః దృశ్యన్తే ।

3. ఇక్కడ వివిధదేశముల నుంచి వచ్చిన వేదాధ్యయనపరులైన బ్రాహ్మణులు కనబడుతున్నారు.

౪. అహో, శోభనా యజ్ఞసమృద్ధిః మహాత్మనః జనకస్య! వయం కుత్ర వత్స్యామః?" ఇతి ।

4. ఆహా! మహాత్ముడైన జనకుని యజ్ఞపు ఏర్పాట్లు చూడముచ్చటగా ఉన్నవి. మనము ఎక్కడ ఉండబోతున్నాము?" అని.

౫. రామస్య తత్ వచనం శ్రుత్వా, విశ్వామిత్రః వివిక్తే సలిలాయుతే దేశే నివేశమ్ అకరోత్ ।

5. రాముడి ఆ మాటను విన్న విశ్వామిత్రుడు జనసంచారము లేక, నీటితో కూడుకొని ఉన్న ప్రాంతంలో బస చేసాడు.

౬. విశ్వామిత్రమ్ అనుప్రాప్తం శ్రుత్వా రాజా జనకః త్వరితం తస్య సమీపమ్ అగచ్ఛత్, తం చ అపూజయత్ ।

6. విశ్వామిత్రుడి రాకను గురించి విని జనకమహారాజు వెంటనే అతడి దగ్గరకు వెళ్ళాడు, అతడిని పూజించాడు కూడా.

౭. మునిః అపి జనకస్య పూజాం స్వీకృత్య, తస్య కుశలం, యజ్ఞస్య చ నిర్విఘ్నతామ్ అపృచ్ఛత్ ।

7. ముని సైతము జనకుడి పూజను స్వీకరించి, అతడి క్షేమమును విచారించాడు, యజ్ఞము ఏ అడ్డంకులు లేకుండా సాగుతున్నదా అని కూడా అడిగాడు.

౮. రాజా అవదత్– "భగవన్, ఏతే మునయః భవాన్ చాసనాని అలఙ్కుర్వన్తు ।

8. రాజు అన్నాడు–"స్వామీ, (మీతో వచ్చిన) ఈ మునులు, మీరు కూడా ఆసనాలను అలంకరించండి.

౯. ధన్యః అస్మి, అనుగృహీతః అస్మి, యత్ ఏభిః మునిభిః సహ మమ యజ్ఞోపసదనం ప్రాప్తః అసి ।" ఇతి ॥

9. ధన్యుడిని అయ్యాను, అనుగ్రహింపబడ్డాను, మీరు ఈ మునులతో కలిసి నా యజ్ఞవాటికకు వచ్చినందున." అని.

--*--

# (౨౮) అష్టావింశః పాఠః — ఇరవై ఎనిమిదవ పాఠము

౧. జనకః బద్ధాఞ్జలిః అవదత్ –

1. జనకుడు అంజలి ఘటించి అన్నాడు –

౨. "భగవన్, కౌ ఇమౌ కుమారౌ వీరౌ ధనుర్ధరౌ? కస్య పుత్రౌ? తత్ శ్రోతుమ్ ఇచ్ఛామి ।" ఇతి ।

2. "స్వామీ, ధనుర్ధారులైన ఈ ఇద్దరు వీరకుమారులు ఎవరు? ఎవరి పుత్రులు? దానిని వినాలని కోరుతున్నాను." అని.

౩. జనకస్య తత్ వచనం శ్రుత్వా, విశ్వామిత్రః అవదత్ –

3. జనకుడి ఆ మాటలను విని, విశ్వామిత్రుడు అన్నాడు–

౪. "రాజన్, ఇమౌ క్షత్రియౌ అయోధ్యా-నాథస్య దశరథస్య పుత్రౌ రామలక్ష్మణౌ లోకవిశ్రుతౌ ।

4. "రాజా, ఈ ఇద్దరు క్షత్రియులు అయోధ్యకు రాజైన దశరథుడి పుత్రులు; రామలక్ష్మణులు; లోకప్రసిద్ధులు.

౫. యత్ శైవం ధనుః తవ కోశాగారే తిష్ఠతి, తత్ ద్రష్టుకామౌ ।

5. ఏ శివధనుస్సు నీ కోశాగారంలోనున్నదో దానిని చూడాలని కోరికతో ఉన్నారు వీరిద్దరు.

౬. తత్ ఆభ్యాం దర్శయ ।

6. దానిని వీరిరువురికీ చూపించుము.

౭. తస్య ధనుఃశ్రేష్ఠస్య దర్శనాత్ కృతకామౌ యథేష్టం గమిష్యతః ।" ఇతి ।

7. ఆ గొప్ప ధనుస్సును చూడటం వలన కోరిక తీరినవారై ఇద్దరూ వారికి నచ్చిన విధంగా వెళ్ళిపోతారు." అని.

౮. మునేః తత్ వచనం శ్రుత్వా జనకః ప్రత్యభాషత–

8. ముని యొక్క ఆ మాట(ల)ను విని జనకుడు బదులుచెప్పాడు–

౯. "బాఢమ్ । ధనుః ఆభ్యాం దర్శయిష్యామి ।

9. "మంచిది. ధనుస్సును వీరిరువురికి చూపిస్తాను.

౧౦. అన్యత్ చ నివేదనీయమ్ ।

10. ఇంకొక మాట చెప్పవలసి ఉన్నది.

౧౧. అస్తి మమ కన్యా సీతా నామ ।

11. ఉన్నది నా కుమార్తె–సీత అని పేరు.

౧౨. 'యః కః అపి వీరః అస్య ధనుషః ఆరోపణం కరిష్యతి, తస్మై ఏవ సుతాం సీతాం దాస్యామి, న అన్యస్మై ।' ఇతి మే ప్రతిజ్ఞా ।

12. "ఏ వీరుడు ఈ ధనుస్సును ఎక్కుపెడతాడో, అతడికే (నా) కుమార్తె సీతను ఇస్తాను, మరొకరికి కాదు.' అని నా ప్రతిజ్ఞ.

౧౩. వయం ప్రాసాదం గచ్ఛామ, ధనుః చ పశ్యామ ।" ఇతి ॥

13. మనము రాజప్రసాదానికి వెళ్ళెదము గాక, మరియు ధనుస్సును చూచెదము గాక" అని.

--*--

# (౨౯) ఏకోనత్రింశః పాఠః — ఇరవైతొమ్మిదవ పాఠము

౧. జనకేన ఆదిష్టాః సచివాః కోశాగారమ్ అగచ్ఛన్ ।

1. జనకుడు చేత ఆదేశించబడిన మంత్రులు కోశాగారానికి వెళ్ళారు.

౨. కోశాగారస్య ద్వారం సదా అర్గలేన పిహితమ్ అభవత్, యతః బహుమూల్యాని వస్తూని తత్ర రక్షణార్థం నిహితాని ఆసన్ ।

2. కోశాగారపు తలుపు ఎల్లప్పుడూ గొళ్ళెముపెట్టి మూయబడి ఉంటుంది, ఎందుకంటే, చాలా విలువైన వస్తువులు అక్కడ భద్రపరచబడి ఉంటాయి.

౩. శివస్య ధనుః అపి తత్ర ఏవ నిహితమ్ ఆసీత్ ।

3. శివుడి ధనుస్సు కూడా అక్కడే ఉంచబడి ఉన్నది.

౪. ద్వారం నిరర్గలీకృత్య, బహూనాం నరాణాం సాహాయ్యేన ఏకస్యామ్ అష్టచక్రాయాం లోహఘటితాయాం మఞ్జూషాయాం ధనుః నిధాయ..,

4. తలుపు గొళ్ళెమును తీసి, చాలామంది సహాయంతో ఒక ఎనిమిది చక్రాల ఇనుపపెట్టెలో ఆ ధనుస్సును పెట్టి---,

౫. ---బహవః నరాః మఞ్జూషాం రజ్వా కథఞ్చన సమవహన్ ।

5. ---చాలా మంది మనుషులు (ఆ)పెట్టెను త్రాడుతో ఎలాగో మోసుకొని వచ్చారు.

౬. తాం చ పురతః కృత్వా, సచివాః ప్రాసాదస్య ప్రాఙ్గణమ్ అగచ్ఛన్ ।

6. దానిని తమ ముందర ఉంచుకొని, మంత్రులు ప్రాసాదపు ఆవరణలోకి వెళ్ళారు.

౭. ఆనీతం ధనుః దృష్ట్వా విశ్వామిత్రః అవదత్ – "వత్స రామ, పశ్య ఇదం ధనుః ।" ఇతి ।

7. తీసుకురాబడిన ధనుస్సును చూసి విశ్వామిత్రుడు అన్నాడు— "నాయనా, రామా, చూడు ఈ ధనుస్సును." అని.

౮. రామః అపి యత్ర సా మఞ్జూషా స్థితా తత్ర గత్వా, ధనుః చ దృష్ట్వా అబ్రవీత్ –

8. రాముడు కూడా ఆ పెట్టె ఉన్న చోటుకు వెళ్ళి, ధనుస్సును చూసాక అన్నాడు–

౯. "అస్య ధనుషః తోలనే పూరణే అపి చ యతిష్యే ।" ఇతి ।

9. "ఈ వింటిని ఎత్తి, ఎక్కుపెట్టేందుకు ప్రయత్నిస్తాను." అని.

౧౦. "బాఢం, యతస్వ ।" ఇతి రాజా జనకః ప్రత్యభాషత ॥

10. "అలాగే, ప్రయత్నించు." అని జనకమహారాజు మారుపలికాడు.

--*--

# (౩౦) త్రింశః పాఠః – ముప్పయ్యవ పాఠము



౧. అహో మాధుర్యమ్ అస్య దృశ్యస్య! ఇదం ప్రాఙ్గణం జనకస్య ప్రాసాదస్య ।

1. ఆహా, ఎంత చక్కని దృశ్యము! ఇది జనకుడి రాచనగరు యొక్క ప్రాంగణము (ముంగిలి).

౨. తస్య పరస్తాత్ రమ్యమ్ ఉపవనం దృశ్యతే।

2. దాని అవతల అందమైన తోట కనబడుతున్నది.

౩. ప్రాఙ్గణే చ మన్దిరం భవతి ।

3. ప్రాంగణములో ఒక భవనము కూడా ఉన్నది.

౪. మన్దిరస్య స్తమ్భాః సోపానం చ, తథా ఏవ ప్రాఙ్గణస్య భూమిః అపి, సర్వాణి ధవలాని స్ఫటికమయాని దృశ్యన్తే ।

4. భవనపు స్తంభాలు, మెట్లు, ప్రాంగణపు నేల అన్నీ తెల్లని పాలరాతిమయమై కనబడుతున్నాయి.

౫. మన్దిరప్రవేశే సింహాసనస్య అగ్రతః వృద్ధః రాజా జనకః విస్మితః ఇవ తిష్ఠతి, తస్య ఉపరి ఛత్రం చ భవతి।

5. భవనపు వాకిలి వద్ద సింహాసనం ముందు వృద్ధుడైన జనకమహారాజు ఆశ్చర్యపోతున్నవాడి వలె ఉన్నాడు. అతడి తలపై గొడుగు ఉన్నది.

౬. తస్య దక్షిణతః చ తస్య కన్యా సీతా ।

6. అతడి కుడిపక్కన అతడి కూతురు సీత.

౭. సా అపి విస్మితా, కిఞ్చిత్ హర్షితా అపి చ దృశ్యతే ।

7. ఆమె కూడా ఆశ్చర్యచకితురాలై ఉన్నది. కొంత సంతోషంగా ఉన్నట్లు కూడా అగుపిస్తున్నది.

౮. ప్రాఙ్గణే చ కతిపయాః జటాధరాః మునయః, ముకుటధరాః రాజపుత్రాః, అన్యే చ నానావిధ–శిరో–వస్త్ర–ధరాః నరాః తిష్ఠన్తి ।

8. ప్రాంగణములో జడలతో ఉన్న కొందరు మునులు, కిరీటాలు ధరించిన రాజకుమారులు, రకరకాల తలపాగాలు ధరించినవారు ఉన్నారు.

౯. సర్వే అపి హస్తప్రక్షేపాత్ విస్మితాః ఇవ దృశ్యన్తే ।

9. వారి వారి చేతులను ఉంచుకున్న తీరును బట్టి అందరూ ఆశ్చర్యపోయినట్లు కనిపిస్తున్నారు.

౧౦. కిం ను తత్ అద్భుతం యేన ఏతే విస్మయన్తే?

10. ఏమా అద్భుతము దేనిచేత వీరు ఆశ్చర్యపోతున్నారు?

౧౧. ఏషః శ్యామలః రమ్యమూర్తిః చాపధరః కుమారః సర్వేషాం విస్మయస్య కారణమ్ ।

11. విల్లును పట్టుకొని ఉన్న ఈ అందగాడైన నల్లని యువకుడు అందరి ఆశ్చర్యానికి కారణము.

౧౨. శివధనుః న కేవలం తేన తోలితం, కిన్తు లీలయా పూరయిత్వా, మౌర్వీమ్ ఆకర్ణమ్ ఆకృష్య, తేన తత్ మధ్యే భగ్నమ్ ॥

12. శివధనుస్సును ఎత్తడమే కాదు, అలవోకగా ఎక్కుపెట్టి, నారిని చెవిదాకా లాగి దానిని నడిమికి విరిచేసాడు అతడు.

--*--

# (౩౧) ఏకత్రింశః పాఠః – ముప్పై ఒకటవ పాఠము

౧. "అహో బత, మహత్ చిత్రమ్!

1. "ఆహా, ఎంత విచిత్రము!

౨. అహో ఆశ్చర్యమ్!

2. ఎంత ఆశ్చర్యకరము!

౩. అహో వీర్యమ్ అస్య కుమారస్య!

3. ఏమి ఈ చిన్నవాడి వీరత్వము!

౪. ఇదం మయా న తర్కితమ్!

4. ఇలా అవుతుందని నేను ఊహించనేలేదు,

౫. 'యః కః అపి వీరః శివధనుషః ఆరోపణం కరిష్యతి, తస్మై ఏవ సీతాం దాస్యామి..,

5. 'శివధనుస్సును ఎక్కుపెట్టిన వీరుడికే సీతను ఇస్తాను,---

౬. ...న అన్యస్మై' ఇతి మమ ప్రతిజ్ఞా అద్య సత్యం భవిష్యతి ।

6. --- మరొకరికి కాదు' అన్న నా ప్రతిజ్ఞ నేడు నిజము కానున్నది.

౭. రామం భర్తారమ్ ఆసాద్య సీతా అస్మాకం కులస్య కీర్తిం వర్ధయిష్యతి ।

7. రాముడిని భర్తగా పొందిన సీత మా ఇంటి కీర్తిని పెంపొందించనున్నది.

౮. ప్రాణేభ్యః అపి ప్రియాం మమ సుతాం రామాయ దాస్యామి ।

8. ప్రాణాల కన్నా ప్రియమైన నా బిడ్డను రాముడికి ఇవ్వనున్నాను.

౯. అయోధ్యాం శీఘ్రం గత్వా దూతాః రాజ్ఞే దశరథాయ ఇదం వృత్తం కథయన్తు, తం చ మిథిలామ్ ఆనయన్తు ।" ఇతి ।

9. అయోధ్యకు వెంటనే వెళ్ళి దూతలు దశరథమహారాజుకు ఈ విషయాన్ని చెప్పెదరు గాక.అతడిని మిథిలకు తీసుకొని వచ్చెదరు గాక" అని.

౧౦. ఏవమ్ ఉక్త్వా జనకః దూతాన్ అయోధ్యాం అహినోత్ ।

10. ఈ విధంగా అని జనకుడు దూతలను అయోధ్యకు పంపాడు.

౧౧. అయోధ్యాం గత్వా, దశరథస్య ప్రాసాదం చ ప్రాప్య..,

11 . అయోధ్యకు వెళ్ళి దశరథుడి భవనానికి చేరుకొని..,

౧౨. ...దూతాః సింహాసనే స్థితం వృద్ధం నృపమ్ అపశ్యన్, అఞ్జలిం చ బద్ధ్వా తమ్ అవదన్ ॥

12. ...దూతలు సింహాసనముపైనున్న వృద్ధరాజును చూసారు, అరచేతులను దోయిలించి అతడితో అన్నారు.

--*--

# (౩౨) ద్వాత్రింశః పాఠః — ముప్పైరెండవ పాఠము

౧. "మహారాజ, మిథిలానాథః జనకః స్నేహ-సంయుక్తేన మధురేణ వచనేన దేవస్య కుశలం పృచ్ఛతి ।

1. "మహారాజా, మిథిలానాథుడైన జనకుడు స్నేహంతో కూడిన తీయనిమాటలతో దేవర (అయిన మీ) క్షేమసమాచారాన్ని అడుగుతున్నారు.

౨. మిథిలా-వృత్తాన్తస్య నివేదనార్థం వయం దేవస్య సమీపం ప్రేషితాః ।

2. మిథిలలోని సమాచారాన్ని నివేదించేందుకు మేము ప్రభువుల వద్దకు పంపబడ్డాము.

౩. బహవః రాజానః జనకస్య కన్యాం సీతామ్ అవృణ్వన్ ।

3. అనేకమంది రాజులు జనకుని కూతురైన సీతను వరించారు.

౪. రాజ్ఞః జనకస్య ప్రతిజ్ఞా తు 'యః కః అపి వీరః శివధనుషః ఆరోపణం కరిష్యతి, తస్మై ఏవ సీతాం దాస్యామి, న అన్యస్మై ।' ఇతి విదితా ఏవ ।

4. అయితే, 'ఎవరు శివధనుస్సును ఎక్కుపెడతారో, వారికే సీతను ఇస్తాను, అన్యులకు కాదు' అన్న జనకమహారాజు ప్రతిజ్ఞ తెలిసినదే.

౫. ధనుషః ఆరోపణే అసమర్థాః తే సర్వే అపి రాజానః విముఖీభూతాః ।

5. ధనుస్సును ఎక్కుపెట్టలేని వారు ఆ అందరు రాజులు తిరుగుముఖం పట్టారు.

౬. రామభద్రేణ పునః న కేవలం తద్ ధనుః ఆరోపితమ్, కిన్తు మౌర్వీమ్ ఆకర్ణమ్ ఆకృష్య, మధ్యే భగ్నమ్ అపి!

6. రామభద్రుడిచేత ఆ ధనుస్సు ఎక్కుపెట్టబడడమే కాదు, మళ్ళీ, వింటి నారి చెవిదాకా లాగబడి, నడుమన విరగ్గొట్టబడింది కూడా.

౭. తస్మాత్ మహారాజః జనకః సీతాం రామాయ, ఊర్మిలాం చ లక్ష్మణాయ దాతుమ్ ఇచ్ఛతి ।

7. అందువలన జనకమహారాజు సీతను రాముడికి, ఊర్మిళను లక్ష్మణుడికి ఇవ్వాలని కోరుతున్నాడు.

౮. దేవం చ సపరివారం తత్ర ఆహ్వయతి । శ్రుత్వా దేవః ప్రమాణమ్ ।" ఇతి ।

8. ప్రభువులను పరివారంతో సహా అక్కడికి ఆహ్వానిస్తున్నారు. విన్న తరువాత ప్రభువు ఆజ్ఞయే మాకు అనుసరణీయము." అని.

౯. దూతానాం వచనేన రాజా పరమ-హర్షితః అభవత్ ॥

9. దూతల మాటలతో రాజు చాలా సంతోషించాడు.

--*--

# (౩౩) త్రయస్త్రింశః పాఠః — ముప్పై మూడవ పాఠము

౧. రాజా సచివాన్ అబ్రవీత్– "శ్రుతమ్ ఏవ భవద్భిః దూతానాం వచనమ్ ।

1. రాజు మంత్రులతో అన్నాడు– "దూతల మాట విన్నారు కదా.

౨. యది అయం సమ్బన్ధః వః రోచతే, శీఘ్రం మిథిలాం పురీం గచ్ఛామ ।

2. ఒకవేళ ఈ సంబంధము మీకు నచ్చితే వెంటనే మిథిలానగరానికి వెళదాము.

౩. కాలక్షేపః మా భవతు" ఇతి ।

3. తాత్సారము వద్దు" అని.

౪. "బాఢమ్।" ఇతి సచివాః అబ్రువన్ ।

4. "మంచిది" అని మంత్రులు అన్నారు.

౫. తేన వచనేన ప్రహృష్టః రాజా అవదత్– "శ్వః గమిష్యామః ।" ఇతి ।

5. ఆ మాటతో సంతోషించిన రాజు అన్నాడు– "రేపు వెళదాము." అని.

౬. దూతాః చ తాం రాత్రిం సుఖేన అయోధ్యాయామ్ అవసన్ ।

6. దూతలు కూడా అయోధ్యలో ఆ రాత్రిని సుఖంగా గడిపారు.

౭. వ్యతీతాయాం రాత్ర్యాం, రాజా సచివమ్ ఏకమ్ ఆదిశత్– "అద్య పుష్కలం ధనమ్ ఆదాయ, ధనాధ్యక్షాః అగ్రే వ్రజన్తు।

7. రాత్రి గడిచాక, రాజు ఒక మంత్రిని ఆదేశించాడు– "నేడు చాలా ధనమును తిసుకొని, కోశాధికారులు (మిగతావారి కన్నా) ముందు వెళ్లవలసింది.

౮. వసిష్ఠ–వామదేవాదయః ద్విజాః అగ్రే గచ్ఛన్తు ।

8. వసిష్ఠ–వామదేవాది బ్రాహ్మణులు ముందుగా వెళ్ళాలి.

౯. చతురఙ్గం సైన్యమ్ చ శీఘ్రం సజ్జం భవతు ।

9. చతురంగ(రథ–గజ–తురగ–పదాతి)బలములతో కూడిన సైన్యము వెంటనే సిద్ధము కావాలి.

౧౦. యథా కాలక్షేపః న భవేత్, తథా సమ్భారాః క్రియన్తామ్ ।" ఇతి ।

10. ఆలస్యము కాని విధంగా ఏర్పాట్లు చేయాలి." అని.

౧౧. నృపః రథమ్ ఆరుహ్య అగ్రతః అగచ్ఛత్ ।

11. రాజు రథాన్ని ఎక్కి ముందుగా వెళ్ళాడు

౧౨. చతురఙ్గం సైన్యం చ తమ్ అన్వగచ్ఛత్ ॥

12. నాలుగు అంగాలతో కూడిన సైన్యం అతడిని అనుసరించింది.

--*--

# (౩౪) చతుస్త్రింశః పాఠః — ముప్పై నాల్గవ పాఠము

౧. మిథిలామ్ ఉపాగతస్య దశరథస్య సమీపం గత్వా, పరం హర్షితః చ భూత్వా, జనకః అవదత్–

1. మిథిలను చేరిన దశరథుడి దగ్గరకు వెళ్ళి, చాలా సంతోషించినవాడై, జనకుడు అన్నాడు–

౨. "మహారాజ, స్వాగతం తే! దిష్ట్యా ప్రాప్తః అసి ।

2. "మహారాజా, నీకు స్వాగతము! (మా) భాగ్యం కొద్దీ వచ్చారు మీరు.

౩. దిష్ట్యా సర్వైః ద్విజ–శ్రేష్ఠైః సహ భగవాన్ వసిష్ఠః ప్రాప్తః ।

3. అదృష్టం కొద్దీ, బ్రాహ్మణోత్తములతో సహా వసిష్ఠభగవానులు వచ్చారు.

౪. యుష్మాభిః సహ సమ్బన్ధేన సమ్భావితం మే కులమ్ ।" ఇతి ।

4. మీతో చుట్టరికము కారణంగా మా వంశము గౌరవించబడింది." అని.

౫. పరస్పర–సమాగమేన పరమహర్షితానాం సర్వేషాం మునీనాం సుఖేన రాత్రిః వ్యతీతా ।

5. ఎదుర్కోళ్ళతో చాలా ఆనందించిన మునులందరికీ రాత్రి సుఖంగా గడిచింది.

౬. అథ అన్యేద్యుః సమన్త్రీ సోపాధ్యాయః సబాన్ధవః దశరథః జనకస్య ప్రాసాదమ్ అగచ్ఛత్ ।

6. అటు పిమ్మట, మరునాడు మంత్రులతో, గురువులతో, బంధువులతో కలిసి దశరథుడు జనకుడి ప్రాసాదానికి వెళ్ళాడు.

౭. 'కన్యాయాః ప్రతిగ్రహే ప్రదానే వా కులం వక్తవ్యమ్' ఇతి సమ్ప్రదాయః ।

7. 'పిల్లను తెచ్చుకొనేటప్పుడైనా, ఇచ్చేటప్పుడైనా వంశపు వివరాలు చెప్పాలి.' అని సంప్రదాయం.

౮. తమ్ అనుసృత్య ఇక్ష్వాకూణాం కులం కులగురుణా వసిష్ఠేన పరికీర్తితమ్ ।

8. దానిని అనుసరించి ఇక్ష్వాకుల వంశము గురించి కులగురువైన వసిష్ఠుడిచేత చెప్పబడింది.

౯. విదేహానాం కులం తు సర్వవేదశాస్త్రేషు ప్రవీణేన జనకేన స్వయమ్ ఏవ పరికీర్తితమ్ ॥

9. విదేహవంశము గురించి మాత్రము సర్వవేదశాస్త్రప్రవీణుడైన జనకుడి చేతనే స్వయముగా చెప్పబడింది.

--*--

## (౩౫) పఞ్చత్రింశః పాఠః — ముప్పై ఐదవ పాఠము

౧. దశరథః– "మమ పుత్రయోః రామలక్ష్మణయోః అర్థే తవ సుతే వరయే ।"

1. దశరథుడు– "నా ఇరువురు పుత్రులు అయిన రామలక్ష్మణుల కొరకు నీ కుమార్తెలిద్దరిని ఎంచుకుంటున్నాను (ఇవ్వమని అడుగుతున్నాను)."

౨. జనకః (సహర్షం)– "వధ్వౌ దదామి, సీతాం రామాయ, ద్వితీయామ్ ఊర్మిలాం చ లక్ష్మణాయ ।

2. జనకుడు (సంతోషంతో)— "వధువులిద్దరిని ఇచ్చెదను. సీతను రాముడికి, రెండవదైన ఊర్మిళను లక్ష్మణుడికి.

౩. త్రిః దదామి । అత్ర న సంశయః ।"

3. ముమ్మారులు ఇచ్చెదను (అని నొక్కి చెప్పుతున్నాను). ఈ విషయమై సంశయము లేదు."

౪. విశ్వామిత్రః– "అనుపమమ్ అత్ర భవతోః కులద్వయమ్ ।

4. విశ్వామిత్రుడు– "మీ ఇరువురి వంశములు సాటిలేనివి.

౫. యోగ్యః చ అయం ధర్మసమ్బన్ధః ।

5. తగినది ఈ ధర్మసంబంధము.[6]"

౬. రామలక్ష్మణయోః సీతోర్మిలాభ్యాం సహ సమ్బన్ధః రూపేణాపి యోగ్యః ఏవ ।

[6] సాటిలేని మీ రెండువంశముల నడుమన ఈ వివాహబంధము ఏర్పడడము సముచితమైనది.

6. రామలక్ష్మణులకు సీతా ఊర్మిళలతో సంబంధము రూపసంపద ప్రకారము కూడా తగియున్నదే.

౭. అన్యత్ చ చిన్తనీయమ్ । యత్ వసిష్ఠస్య మమ చ వాఞ్ఛితం తత్ శ్రూయతామ్ ।

7. మరొకటి ఆలోచించదగినది ఏమంటే – నాయొక్క, వసిష్ఠుడియొక్క కోరికను వినెదరుగాక.

౮. తవ యవీయసః భ్రాతుః రాజ్ఞః కుశధ్వజస్య సుతే, మాణ్డవీం శ్రుతకీర్తిం చ, భరతశత్రుఘ్నాభ్యాం దాతుమ్ అర్హసి ।"

8. నీ తమ్ముడైన కుశధ్వజుని కుమార్తెలైన మాండవీశ్రుతకీర్తులను భరతశత్రుఘ్నులకు ఇచ్చుటకు తగుదువు (ఇవ్వగలవు)."

౯. జనకః (బద్ధాఞ్జలిః)– "నిజకులం ధన్యం మన్యే యత్ అస్మాకమ్ ఈప్సితమ్ అనాయాసేన ఏవ లభ్యతే ।

9. జనకుడు (చేతులు దోయిలించి) – "నా వంశము ధన్యమైనదని భావిస్తున్నాను – ఏలననగా మా కోరిక శ్రమ లేకుండా తీరినది.

౧౦. ఏవం భవతు । ఉభౌ భరతశత్రుఘ్నౌ అపి భార్యే భజేతామ్ ।

10. అలాగే కానివ్వండి, భరతశత్రుఘ్నులిరువురు కూడా భార్యలను పొందెదరు గాక.

౧౧. ఏకస్మిన్ ఏవ దినే చత్వారః వరాః చతస్సృణాం వధూనాం పాణీన్ గృహ్ణన్తు ।

11. ఒకే రోజున నలుగురు వరులు నలుగురు వధువుల(తో) పాణిగ్రహణము చేసెదరు గాక."

౧౨. (ఏవం నిర్వృత్తే వాక్నిశ్చయే, జనకమ్ ఆపృచ్ఛ్య దశరథః స్వమ్ ఆలయమ్ అగచ్ఛత్ ।

12. (ఈ విధంగా మాట నిశ్చయం చేసుకున్నాక, జనకుడిని అనుమతి అడిగి దశరథుడు తన నివాసానికి వెళ్ళాడు.

13. వివాహపూర్వగాన్ సంస్కారాన్ చ అకరోత్ ॥)

౧౩. పెళ్ళికి ముందు జరిపించాల్సిన సంస్కారాలను జరిపించాడు కూడా.)

--*--

# (౩౬) షట్త్రింశః పాఠః — ముప్పై ఆరవ పాఠము

౧. అథ అపరేద్యుః శుభే ముహూర్తే వసిష్ఠాదయః ఋషయః వరైః సహ యజ్ఞవాటమ్ ఉద్దిశ్య ప్రస్థితాః ।

1. అటు పిమ్మట, ఆ మరునాడు మంచి ముహూర్తములో వసిష్ఠుడు మొదలైన ఋషులు పెళ్ళికొడుకులతో కలిసి యజ్ఞవాటికకు బయలుదేరారు.

౨. తత్పూర్వమ్ ఏవ తత్ర గత్వా ఆభరణ–భూషితాః రామాదయః పితుః జనకస్య సమీపమ్ అతిష్ఠన్ ।

2. అంతకు మునుపే అక్కడికి వెళ్ళినవారు, నగలతో అలంకరించబడినవారున్నూ అయిన రాముడు మొదలైనవారు తండ్రియైన జనకుడి సమీపములో ఉండినారు.

౩. వధూభిః సహితః జనకః వేదీసమీపం స్థిత్వా తాన్ ప్రత్యైక్షత ।

3. పెళ్ళికూతుళ్ళతోనున్న జనకుడు (హోమ)వేదిక దగ్గర ఉండి వారికై ఎదురుచూసాడు.

౪. వేదీ గన్ధపుష్పాదిభిః అలఙ్కృతా ఆసీత్ ।

4. వేదిక గంధము, పుష్పములు మొదలైనవాటితో అలంకరించబడినదై ఉన్నది.

౫. వేదీం పరితః చ వివిధాని అర్ఘ్యపాత్రాణి ఆసన్ ।

5. వేదిక చుట్టూ రకరకాల అర్ఘ్యపాత్రలు ఉన్నాయి.

౬. వేద్యాం మన్త్రపూర్వకమ్ అగ్నిమ్ ఆధాయ వసిష్ఠః అజుహోత్ ।

6. వేదికపై మంత్రమును చదువుతూ అగ్నిని నిలిపి వసిష్ఠుడు యజ్ఞమును చేసాడు.

౭. తతః సీతాం సమానీయ, తాం చ రామస్య అభిముఖం సంస్థాప్య అగ్నేః సమక్షం జనకః అవదత్–

7. ఆ తరువాత, సీతను తెచ్చి, ఆమెను రాముడి ఎదురుగా నిలిపి అగ్నియొక్క సమక్షములో జనకుడు అన్నాడు–

౮. "ఇయం సీతా మమ సుతా తవ సహధర్మచారిణీ । ఏనాం ప్రతీచ్ఛ । పాణినా పాణిం గృహాణ ।

8. "ఈమె సీత. నా బిడ్డ. నీ భార్య. ఈమెను స్వీకరించుము. (నీ) చేతితో (తన) చేతిని పట్టుకొనుము.

౯. లక్ష్మణ, ఆగచ్ఛ । ఊర్మిలాం ప్రతీచ్ఛ । పాణినా పాణిం గృహాణ ।

9. లక్ష్మణా, రమ్ము. ఊర్మిళను స్వీకరించుము. నీ చేతితో తన చేతిని పట్టుకొనుము.

౧౦. భరత, ఆగచ్ఛ । మాణ్డవ్యాః పాణిం పాణినా గృహాణ ।

10. భరతా, రమ్ము. మాండవియొక్క చేతిని చేతితో పట్టుకొనుము.

౧౧. శత్రుఘ్న, ఆగచ్ఛ । శ్రుతకీర్త్యాః పాణిం పాణినా గృహాణ ।

11. శత్రుఘ్నా, రమ్ము. శ్రుతకీర్తియొక్క చేతిని చేతితో పట్టుకొనుము.

౧౨. పతివ్రతాః ఛాయాః ఇవ ఏతాః యుష్మాన్ అనుగమిష్యన్తి ।"

12. ఈ పతివ్రతలు నీడలవలె మిమ్ములను వెంబడిస్తారు."

౧౩. ఇతి ఉక్త్వా రాజా తేషాం హస్తేషు మన్త్రపూతమ్ ఉదకమ్ అపాతయత్ ।

13. అని పలికి రాజు వారియొక్క చేతులలో మంత్రముతో పవిత్రము చేయబడిన నీటిని పోసాడు.

౧౪. "సర్వే భవన్తః సౌమ్యాః చ సుచరితవ్రతాః చ భార్యాభిః తథైవ వర్తన్తామ్ ।" ఇతి ।

14. "మెత్తని వారు, మంచి నడవడి కలవారు కూడా అయిన మీరందరూ (మీ) భార్యలతో అలాగే ఉండండి" అని (పలికిన)

౧౫. జనకస్య తత్ వచనం శ్రుత్వా చత్వారః వరాః చతసృణాం వధూనాం హస్తాన్ హస్తైః అస్పృశన్ ।

15. జనకుడి ఆ మాటను విన్న నలుగురు పెళ్ళికొడుకులు నలుగురు పెళ్ళికూతుళ్ళ చేతులను (తమ) చేతులతో తాకారు.

౧౬. సభార్యాః అగ్నిం వేదిం రాజానమ్ ఋషీన్ చ త్రిః ప్రదక్షిణీకృత్య, విధిపూర్వకం వివాహమ్ అకుర్వన్ ॥

16. భార్యలతో సహా అగ్నీ హోమవేదీ రాజులూ ఋషుల చుట్టూ ముమ్మారు తిరిగి శాస్త్రవిధి ప్రకారము పెళ్ళి చేసుకున్నారు.

--*--

# (౩౭) సప్తత్రింశః పాఠః – ముప్పై ఏడవ పాఠము

౧. ఏవమ్ నిర్వృత్తే వివాహే, విశ్వామిత్రః మహాముని: రాజానౌ ఆపృచ్ఛ్య స్వమ్ ఆశ్రమమ్ అగచ్ఛత్ ।

1. ఈ విధముగా వివాహము జరిగాక విశ్వామిత్రమహాముని రాజులనిద్దరినీ సెలవడిగి తన ఆశ్రమానికి వెళ్ళాడు.

౨. గతే చ విశ్వామిత్రే, దశరథః అపి జనకమ్ ఆపృచ్ఛ్య అయోధ్యామ్ ఉద్దిశ్య ప్రస్థానమ్ అకరోత్ ।

2. విశ్వామిత్రుడు వెళ్ళాక, దశరథుడు సైతము జనకుడిని సెలవు అడిగి అయోధ్యకు బయలుదేరాడు.

౩. అథ అయోధ్యాం గచ్ఛతః దశరథస్య పరివారః మార్గే సహసా ఏవ ససమ్భ్రమః అభవత్ ।

3. అంతలో అయోధ్యకు వెళుతున్న దశరథుడి పరివారము దారిలో ఉన్నట్లుండి కలవరపాటుకు లోనైంది.

౪. తత్ర ప్రాప్తః జటాధరః జమదగ్నిపుత్రః పరశురామః తస్య సమ్భ్రమస్య కారణమ్ ।

4. అక్కడికి వచ్చిన జటాధారి[7]–జమదగ్ని కుమారుడు అయిన–పరశురాముడు ఆ కలవరపాటుకు కారణము.

౫. తస్య పితా జమదగ్నిః కేనచిత్ క్షత్రియేణ హతః ।

---

[7] జడలు ఉన్నవాడు, ఋషి

5. అతడి తండ్రి జమదగ్ని ఎవరో క్షత్రియుడిచేత చంపబడ్డాడు.

౬. తస్మాత్ తేన క్షత్రియకులాని అనేకశః ఉత్సాదితాని।

6. అందువలన అతడిచేత క్షత్రియవంశాలు అనేకముగా నిర్మూలింపబడ్డాయి.

౭. "న ఖలు దశరథస్య కులమ్ అద్య ఏషః ఉత్సాదయిష్యతి!" ఇతి సర్వే మిథః అజల్పన్।

7. "దశరథుడి వంశమును నేడు ఇతడు అంతరింపజేయడు కదా!" అని అందరు ఒకరితో ఒకరు అనుకున్నారు.

౮. వసిష్ఠప్రముఖాః ఋషయః అర్ఘ్యేణ జామదగ్న్యం రామమ్ అపూజయన్।

8. వసిష్ఠుడు మొదలైన ఋషులు అర్ఘ్యముతో జమదగ్ని కొడుకైన రాముడిని పూజించారు.

౯. తామ్ ఋషిదత్తాం పూజాం ప్రతిగృహ్య, జామదగ్న్యః రామః దాశరథిం రామమ్ అభ్యభాషత–

9. ఋషులతో ఈయబడిన ఆ పూజను స్వీకరించి జామదగ్న్యరాముడు దాశరథి[8] అయిన రాముడితో అన్నాడు–

౧౦. "రామ, దాశరథే రామ, శ్రుతం మయా తవ వీర్యమ్।

10. "రామా, దాశరథివైన రామా, నీ వీరత్వము గురించి విన్నాను.

౧౧. శ్రుతం చ తత్ శివధనుషః భేదనమ్।

11. ఆ శివధనుస్సు యొక్క విరిచివేత గురించి కూడా తెలిసినది.

---

[8] దశరథుని కుమారుడు

౧౨. పశ్య, ఇదమ్ అపరం మహత్ ధనుః వైష్ణవమ్ ।

12. చూడు, ఈ ఇంకో పెద్ద ధనుస్సు విష్ణువుకు చెందినది.

౧౩. అస్మిన్ బాణమ్ ఆరోప్య స్వం బలం దర్శయ ।

13. దీనిలో బాణమును ఎక్కుపెట్టి నీ బలాన్ని చూపించు.

౧౪. యది ఇచ్ఛసి, ద్వన్ద్వం తే దాస్యామి।" ఇతి ॥

14. నీవు కోరుకుంటే, ద్వంద్వయుద్ధాన్ని నీకు ఇస్తాను[9]" అని.

--*--

[9] కావాలంటే, మనమిద్దరమే యుద్ధం చేద్దాము

# (౩౮) అష్టాత్రింశః పాఠః — ముప్పై ఎనిమిదవ పాఠము

౧. పరశురామస్య తద్ వచనం శ్రుత్వా, విషణ్ణవదనః, దీనః, బద్ధాఞ్జలిః దశరథః అవదత్–

1. పరశురాముడి ఆ మాటను విని, విషాదవదనుడు, జాలి గొలుపుతున్నవాడు, చేతులు దోయిలించినవాడు అయిన దశరథుడు అన్నాడు–

౨. "భగవన్, మమ పుత్రాః అద్యాపి బాలాః ఏవ ।

2. "స్వామీ, నా కుమారులు నేటికీ బాలురే.

౩. బాలేభ్యః అభయం దాతుమ్ అర్హసి ।

3. బాలురకు అభయము ఇవ్వగలవు.

౪. బాలేషు హతేషు కథం ను వయం జీవామః? సర్వవినాశం మా కురు ।" ఇతి ।

4. (ఈ) బాలురు చంపబడినాక, మేము ఎలా జీవిస్తాము? సర్వనాశనము చేయవద్దు." అని.

౫. ఋషయః అపి అబ్రువన్– "భగవన్ జామదగ్న్య, ప్రసీద! క్షమా వీరస్య భూషణమ్ ।" ఇతి ।

5. ఋషులు కూడా చెప్పారు–"దేవా, జమదగ్ని కుమారుడా, ప్రసన్నుడవు కమ్ము! ఓర్పు వీరుడికి అలంకారము." అని.

౬. క్రుద్ధః దాశరథిః తు జామదగ్న్యస్య హస్తాత్ తత్ వైష్ణవం ధనుః, బాణం చ ప్రతిగృహ్య అవదత్–

6. కోపించిన దశరథపుత్రుడు మాత్రము జమదగ్నియొక్క కుమారుడి చేతినుంచి ఆ విష్ణుధనుస్సును, బాణమును తీసుకొని అన్నాడు–

౭. “యది మామ్ అవజానాసి, పశ్య ఏతం మే పరాక్రమమ్!” ఇతి ।

7. “నన్ను తక్కువవాడిగా భావిస్తున్నట్లైతే, చూడు ఈ నా పరాక్రమాన్ని” అని.

౮. ధనుషి బాణం చ సన్ధాయ జామదగ్న్యమ్ అబ్రవీత్–

8. వింట అమ్మును తొడిగి జమదగ్ని కుమారుడితో అన్నాడు –

౯. “అయం వైష్ణవః బాణః మోఘః న పతతి ।

9. “ఈ విష్ణుబాణము వృథా కాదు.

౧౦. బ్రాహ్మణః అసి ఇతి మమ పూజ్యః।

10. బ్రాహ్మణుడవు అని నాకు పూజింపదగినవాడివి.

౧౧. తస్మాత్ ఇమం ప్రాణహరం బాణం త్వయి మోక్తుం న ఇచ్ఛామి ।

11. అందువలన ఈ ప్రాణాంతకమైన బాణమును నీపై విడవడానికి ఇష్టపడటం లేదు.

౧౨. తత్ కథయ మే । కః అన్యః హన్తవ్యః?” ఇతి ।

12. అందువలన చెప్పు నాకు. చంపదగినవాడు వేరే ఎవడు ఉన్నాడు?” అని.

౧౩. తత్ మహద్ అద్భుతం దృష్ట్వా పరశురామః గర్వపరిహారాత్ జడీకృతః అభవత్ ।

13. ఆ మహాద్భుతాన్ని చూసి పరశురాముడు గర్వము నశించినందున స్తంభించిపోయాడు.

౧౪. ఏవం నిర్జితే పరశురామే, నిర్విఘ్నః పరమహర్షితః దశరథః అయోధ్యామ్ ఉద్దిశ్య ప్రస్థితః, తత్ర ప్రాప్తః చ ।

14. ఈవిధంగా పరశురాముడు ఓడించబడ్డాక, ఆటంకాలు తొలగిన, ఎంతో సంతోషించిన దశరథుడు అయోధ్యకు పయనమయ్యాడు, అక్కడకు చేరుకున్నాడు కూడా.

౧౫. రాజప్రవేశ-సమయే పురీ సిక్తరాజపథా, ప్రకీర్ణ- కుసుమోత్కరా, నానా-ధ్వజాలఙ్కృతా, మఙ్గల-వాదన-నినాదితా, జనౌఘ-సమలఙ్కృతా చ అభవత్ ।

15. రాజు ప్రవేశించే సమయానికి— ఆ నగరపు రాజమార్గాలు నీళ్లతో తడపబడ్డాయి; రకరకాల పూలగుత్తులతో, రంగురంగుల జండాలతో (ఆ నగరం) అలంకరించబడింది; (అన్ని చోట్లలో) మంగళవాద్యధ్వనులు వినబడుతున్నాయి; జనాలు అంతటా గుమికూడుతున్నారు.

౧౬. పౌరేషు చ మహాన్ ఉత్సవః ఆసీత్ ॥

16. పురవాసులలో చాలా సంబరము నెలకొన్నది.

--*--

**శ్రీరస్తు, శుభమస్తు, మంగలం మహత్**